# బుద్ధిమతీయము





రచయిత:

కర్రి ఈశ్వరరావు

తెర్లాం

1958

వెల రు 1—0—0.

నెరుగగోరి యంతిపురమునకు వచ్చి కుమారి యుద్దేశము సుముఖమని గ్రహించి రాజభటులను సందేశముతోబాటు కుంతలదేశమునకు పంపించును. యుక్తిచే కార్యము సాధింపనెంచిన రాకుమారి తత్తరిల్లి మంత్రికుమారుని కుంతలదేశమునకు పంపును. అది మొదలు కష్టములు ప్రారంభము. అది బహుశః వంచనాఫలితమే కావచ్చును.

లతాంతాయుధు తలదన్ను బుద్ధిమతిని పెనురక్కసి కామించి విఫలయై మాయాగృహమున నుంచును. జీవితోన్నతి పరికట్టు నిట్టి రక్కసులు తలస్థపడగా వారి వలలో చిక్కుకొన్నను, చిక్కకున్నను నిడుముల బడువారి నెందరనో చూచుచున్నాము. దేహసౌందర్యముకంటె హృదయ సౌందర్యము, కామముకంటె ప్రేమము నుత్తమోత్తములని రచయిత చక్కగా నిరూపించినాడు. అంతియేకాదు. పొంగులువారు యౌవనోద్రేకమున ప్రణయినిని మరచి వ్యభిచారిణులను రాక్షసాంగనల బారిపడ కూడదని యువకుల కిదియొక హెచ్చరికగా నేను భావింతును. స్వేచ్ఛాగమనమును ప్రసాదించు వనమూలిక యోగీంద్రునిచే బుద్ధిమతి కీయబడినది. కాని విపత్కాలములో నది యుపయోగింపబడనే లేదు. కొండను తలక్రింద పెట్టుకొని రాళ్ళను వెదికినట్లు యుక్తాయుక్త విచక్షణాగల బుద్ధిని జీవితగమనములో మన ముపయోగింపలేకపోవుట నీ ఘటన స్ఫురింపజేయుచున్నది. కుంతలరాజపుత్రి వసుంధరయు బుద్ధిమతిని కామించినది. ప్రేమించినది. తన మనోభీష్టము తీర్పని బుద్ధిమతిని కారాగారములో నుంచినది. ఆమెకు తల్లిగాని తండ్రిగాని లేరు. పైగా రాజ్యాధికారిణి. అహంభావము, రాజసము మూర్తీభవించిన వనిత యామె. వాస్తవ ప్రపంచమున నిట్టివారికి కొదువలేదు. ఇక మంత్రికుమారుడు ఒకవిధముగా దురదృష్టవంతుడు. వేరొక విధముగా అదృష్టవంతుడు. బాల్యము నుండియు గురుశుశ్రూషచే సకలశాస్త్రములు నేర్చినాడు. అన్నివిద్యల నారితేరినాడు. కాని సమయమున కేవియు నక్కరకురాలేదు. ఇది యాతని దురదృష్టము. శైశవమునుండి తన్నే దేవునిగా నారాధించిన విజయకుమారి యొకవంక — అప్పటికప్పుడు దొంగతన మారోపింపబడిన

తనయందు ప్రేమ పెనగొన పరిణయమాడ నెంచిన వసుంధర మరియొక వంక. ఇద్దరు కులశీలవిద్యాదులలో ప్రసిద్ధిగన్నవారే. ఇది యీతని అదృష్టము.

కథాగమనమును వేరొకరీతి చూచినచో సుపయుక్తములగు విషయము లిందు పెక్కుగలవు. కార్యసాధనమునందు పట్టుదల — తలవని తలంపుగా వచ్చిన కష్టసుఖములలో క్రుంగుట, పొంగుట కూడదనుట — సమయస్ఫూర్తి — ప్రేమ మహిమ మొదలగునవి పాఠకుల నాకర్షింపవచ్చును. నేడు బాలవాఙ్మయముగా వెలువడుచున్నదానిలో అధిక భాగముకంటె — కథానికలు, కథలు మొదలగువానికంటె నిది హృదయంగమముగను శ్రేష్ఠముగనున్నది. బాలురు భాషయం దభిరుచి పెంపొందించుకొనుట కిది యుపకరించును.

ఈ పుస్తకమునందు సరిచూడవలసిన వాక్యములు, పదములు, కొన్ని మార్పుల యావశ్యకత లేకపోలేదు. అయినను వ్యవధిలేదు. రెండవ ముద్రణములో రచయిత అట్టి లోపమును సరిదిద్దుకొనునని నా నమ్మకము. శ్రమించి నవలాపద్ధతిలో వ్రాసిన శ్రీ ఈశ్వరరావు పాఠకుల అభిమానము చూరగొనుననియే నా తలంపు.

గీ. కర్రివంశ సుధాంబుధి కలశభవుడు
సరసు డీశ్వరరావు ప్రశస్తమైన
బుద్ధిమతికథ వ్రాసి యపూర్వమైన
హర్ష మధువును నింపె హృదయాంబుజమున.

ఉ. ఇంపును పెంపుసొంపు వహియించెడి సత్కథ లిట్లువ్రాసిగా
వింపుము ! మోదమున్ పఠితలెల్లరకున్, కృషిచేసి యీవు సా
ధింపుము ! నవ్యరీతులను తీయని తేటతెలుంగుబాసలో;
సంపదలున్ సుఖంబులును సద్యశమందెదు దైవసత్కృపన్.

భాషాప్రవీణ, కాకరపర్తి ముఖలింగశర్మ,
ప్రధానాంధ్రోపాధ్యాయుడు,
బోర్డు హైస్కూలు, తెర్లాం.

# తొలి పలుకు

మిత్రుఁడు శ్రీ కర్రి ఈశ్వరరావు రచించిన 'బుద్ధిమతీయము' అను కథ నాద్యంతముఁ బఠించి, మిక్కిలి యానందించితిని. ఈ గ్రంథము శ్రీ ఈశ్వరరావు వ్రాయుచున్నప్పుడే నేను వీరిని గలయుటయు, నప్పటికి రచించిన కథాంశము నీతఁడు చదువగా వినుటయు జరిగెను. 'కథ చాల బాగున్నదనియు, రచన సుందరముగా నున్నదనియు' నే నీ మిత్రుని హెచ్చరించి త్వరగా ముగింపవలసినదని కోరితిని. నేటికీ కవి మిత్రుఁ డీ గ్రంథమునుఁ బూర్తిచేసి, బరిష్కారమునకై పంపెను. పరిష్కరించుట కంతగా నవకాశమున్నట్లు కనుపట్టమి, గ్రంథము నంతయు మఱియొక పర్యాయము చదివి, చిన్నచిన్న సవరణలు మాత్ర మక్కడక్కడఁ గావించితిని. ఆయుర్వేదవైద్యుఁడగు నీతఁ డిట్టి కథాంశమును, స్వాంతముగఁ గల్పించుకొని, కల్పనాచమత్కారమునకుఁ దగినట్టుగా, గ్రంథమునంతయుఁ జక్కని గద్యలో వ్రాసి ముగించుట యెంతయు ముదావహము.

'గద్యము పద్యమువలె, గణనకెక్కదని' పెద్దల నుడియై యున్నను, ననేకములగు గద్యగ్రంథములు, సంస్కృతాంధ్రభాషలలో రచింపఁబడినవి. నేఁటికిని భాషావేత్తలు పఠించి యానందించుచునే యున్నారు. సలక్షణముగ నుండి, చక్కని పాండిత్యమును సమకూర్చు, మ॥ సుబ్బన్నదీక్షితులవారి 'కాశీమజిలీ కథలు', పా॥ లక్ష్మీనరసింహారావుగారి 'సాక్షి' గ్రంథములు చదువని యాంధ్రుఁ డుండఁడు. పదేపదే వానిని జదువుచునే యున్నారు. ఆనందించుచునే యున్నారు.

మంచి శైలిలో, చాలమట్టుకు 'గ్రాంథికము'గనే వ్రాయఁబడిన, యీ 'బుద్ధిమతీయ' మను కనుథగూడ ఆంధ్రభాషాభిమానులు చదివి, యానందించఁగలరని యాశించుచున్నాను.

ఈ గ్రంథమునం దక్కడక్కడఁ గూర్పు మంచి బింకముగానుండి, రచనాసౌందర్యమును వెల్లడించుచున్నదనుటలో సందియము లేదు. మచ్చునకు 5. సమ్మేళనములో - రెండవ 'పేరా' పూర్తిగఁ దిలకించినచో, జదువరులు గ్రహించఁగలరు. ఇట్లే కొన్నితావులయందు రచన తద్దయు మనోహరముగా నున్నది.

ఇట్టి గ్రంథము లింకను నీ కవిమిత్రుఁడు రచించి, మంచి రచయిత యై నెగడఁగల్గునని యాశించుచు, సర్వత్ర యీతనికి మేలు కలుగఁజేయ వలసినదని, పరమేశ్వరునిఁ బ్రార్థించుచు, నింతటితో విరమించుచున్నాను.

బిలాస్‌పూరు,
20–3–56.

భాషాభిమాని
'మధురకవి', అ. వరాహనరసింహమూర్తి.

---

I have gone through the book "Buddhimatiyam" written by Mr. Karri Eswararao, a buddiag author. This is ever the first attempt of his. The theme is good. I appreciate very much for the attempt made by him; and I wish that he should continue his attempt. I believe many more products of his will see the light of the day in the near future.

THERLAM,
7-4-58.

**G. V. Jagannadha Rao,** B.Sc., B.Ed.,
*Headmaster,*
BOARD HIGH SCHOOL.

---

Mr. K. Eswara Rao is a native of this village and I have known him from his boyhood even as a Student of the Local Board High School Therlam. This is the first time for me to note that Mr. Eswara Rao is an author when I happened to go through the book "Buddhimatiyam".

The story is attractive and the style is simple. I hope the public will greatly appreciate the book.

I wish him every success and he deserves every encouragement from the public.

**M. Surya Rao,**
**B.A. (Telugu), B.A. (History),**
*President,*
Village Committee, THERLAM.

THERLAM,
8-4-58.

# నా మాట



బుద్ధిమతీయమును నే వ్రాయుచున్నప్పుడు శ్రీ అనిపింది వరాహ నరసింహామూర్తిగారు జూచి కథ చాల బాగున్నదనియు, వీలైనంతవఱకు సవరింతుననియు జెప్పి కథ ముగిసిన పిదప శ్రమతమాదులకోర్చి కథ నంతయు సాంతముగ చదివి అక్కడక్కడ చిన్న సవరణలుమాత్రము జేసి అభిప్రాయము నొసంగినందులకు నా కృతజ్ఞతవందనములు. బుద్ధిమతీయమును యిచ్చినదే తడవుగ నాద్యంతము పఠించి అభిప్రాయముల నిచ్చిన మహారాజశ్రీ పూజ్యులు శ్రీ మల్లాప్రగడ సూర్యారావుగారికి, మహారాజశ్రీ గురువర్యులు శ్రీ గిడుగు వెంకటజగన్నాథరావుగారికి, మహారాజశ్రీ పండితులు శ్రీ కాకరపర్తి ముఖలింగశర్మగారికి నా కృతజ్ఞత వందనశతకంబులు. ఈ పుస్తకమునందు సరిచూడవలసిన వాక్యములు, పదములు కొన్ని మార్పుల యావశ్యకత గలదు. అయినను వ్యవధి లేక పోవుటచే రెండవ ముద్రణములో అట్టి లోపమును సరిదిద్దుకొందు నని పాఠకులకు హెచ్చరించుచున్నాను.

రచయిత.



అవిఘ్నమస్తు

శ్రీ

# బుద్ధిమతీయము



## 1 సంతానము:

పూర్వ మొక నదీసమీపమున నొక పురము గలదు. అయ్యది విద్యాక్షాత్రధనసస్య విభవులగు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులతో చతుష్పాద ధర్మమువలె నలరారుచుండెను. ధర్మమే బాటలుగా నిర్మింపఁబడిన యా ప్రోలునం దధర్మము చొచ్చుటకు మార్గము లేశమైన లేకుండెను. అచట సమస్తబ్రాహ్మణులు సత్యమే వ్రతముగాఁ గలవారై నిత్యవేదానుష్ఠానసంపన్నులై యొప్పుచుండిరి. చతుర్వేదములయం దారి తేరిన యా భూసురోత్తముల ముఖములు చతుర్ముఖుని మాటిమాటికి గేలిసేయునట్లుండెను. వారలుసేయు యజ్ఞయాగాది కర్మలకు వాసవుఁడు సంతృప్తుఁడై నెలకు మూఁడు వానలు గురిపించుచుండెను. సస్యము లద్దాన బుష్కలముగా ఫలించుచుండెను. "ధర్మంచర" యను వాక్యమును పాటించి తదనుగుణముగా రాజనీతి ధర్మములు విచారించుచు, నధిక బాహుబలాఢ్యులై శత్రువులఁ జొరనీయక, దస్యు గజరాజసింహాలను ప్రఖ్యాతివడసి ప్రజల సౌఖ్యమే తమ సౌఖ్యమని భావింపుచు నఖండకీర్తి గడించిన క్షత్రియోత్తముల కా పట్టణము తరతరాల పాడియే! "పరార్థవంచనా" శూన్యులై రత్నములనైన రాసులుగఁబోసి యమ్మఁగల వైశ్యులతో నప్పురం బలకానగరంబువోలె నొప్పుచుండె. ప్రాలుమాలిక యన నేమిటో యెరుఁగక కృషీవంతులై శూద్రులు సస్యములు గూర్చుచుండిరి. అన్యోన్య పరస్పరానుబంధము గలవారలై యన్ని

మైరి. పలువురు పండితులు, జ్యోతిష్కులు, ఆరితేఱిన గాయకశిఖామణులు, మహాకవులు, రాజ్యప్రజలును నిండియున్న, నాటి సభ చూడ వేడుకగా నుండెను. ఆ సమయమున మంత్రియగు సత్యకీర్తి సభాజనము నంతయుఁ గలయఁజూచి యిట్లని పలుక నారంభించెను.

"సభ్యులారా ! పండిన యరఁటితోఁటవలెఁ బ్రకాశించుచున్న యీ సభా మధ్యమున నే నొక మాట జెప్పవలసియున్నది. ఏకాగ్ర చిత్తులై మీ రియ్యది వినఁగోరెదను.

మన ప్రభువులు సంతానశూన్యులై దివులు బొందుచున్నట్లు మీ కందఱకు విదితమే ! సమస్త భోగభాగ్యములతోఁ దులతూగుచున్న వారికైనను సంతాన మనునది లేనిచో సంతోషముండదుగదా ! అందులోను పుత్త్రులు లేనివారికిఁ బున్నామ మను నరకము ప్రాప్తించును. పుత్త్రహీనుఁడైన రాజేలు భూమి, దౌర్భాగ్యభూమియే ! ప్రభువులు సంతానలాభమునకై చేసిన వ్రతములకు, మెట్టిన తీర్థములకు మితిలే దయ్యెను, ఫలితము శూన్యమయ్యెను. "అపుత్రస్య గతిర్నాస్తి" యను ధర్మానుసారముగా, పుత్త్రహీనులకు గతులు లేవని మన మెఱింగియుండియు, ప్రభువులపట్ల మనము ముభావము వహించుట పాడివిరుద్ధము.

మనలో సంతాన మనుగ్రహించు ప్రభావులు లేరయ్యెను. ప్రబల జోస్యములుగూడ శూన్యఫలితములయ్యెను. రానురాను మన ప్రభువుల చింతావారధికి మేరలేకుండెను. కావున మన మిత్తఱి చేయవలసిన కర్తవ్య మించుక నాకుఁ దోఁచిన విధముగ వివరింతును.

రేపు వివిధదేశములలో, రాజవీధులలో మన ప్రభువుల సంతాన యోగ్యతను గురించి శిలాశాసనములు వ్రాయించి నిలుపవలయును. అట్లు శాసనస్తంభంబుల నిలిపినచో మన ప్రయత్నము సఫలీకృతమగును. మొత్తముపై మహానీయు లెవరైన నుండకమానరు. మన భూదేవుల

మనోవాంఛయు ఫలించకపోదు. కాని శాసనములోని ముఖ్యాంశ మేమనగా ? ఏ మహామహులు మన ప్రభువులయొక్క యభీష్ట మీడేర్చు దురో ? వారికీ రాజ్యములో నర్ధభాగము బహుమతిక్రింద నీయఁబడును. ఇది ప్రభువుల నిశ్చయము.

ఇయ్యదియే తగిన కర్తవ్యమని నాకుఁ దోఁచెడిని.''
అని సభాజనమంతయు నుప్పొంగునట్లు గంభీరభాషణముల నా మంత్రిశేఖరుఁడగు సత్యకీర్తి కర్తవ్యాంశముపన్యసించి స్వీయాసనము నధిష్ఠించెను.

సభికులందఱు మంత్రివరుని మాట లాలించి, యాతని మనోనైర్మల్యమున కచ్చెరువంది, తద్వాక్యామృతము తనివితీఱ గ్రోలినవారగుట, హృదయముల నేదో చెప్పరాని యానంద మనుభవించుచు, నొక్కసారందఱు, నేకకంఠ్యముగా సభాసరస్సు కలఁగిపోవునట్లు, "సత్యకీర్తి మంత్రివర్యులు వచించినదే మంచి యుపాయ మనియు, నెంతయు సమయోచితముగా నున్నదనియు, రాజభక్తి యన నట్లుండవలయు ననియు," హర్షభాష్పములు కన్నుకోనలనుండి దొరఁగ, నిష్కల్మష హృదయులై యనిరి.

పండితప్రజాభిప్రాయములు గూడ నేకీభవించుటచే చ్చాల సంతోషించినవాఁడై, తాపము కొంత చల్లారి, కోరిక లిగురొత్త వికసించిన మోముతో నా రాజేంద్రుఁడు శరత్కాల చంద్రుని చందంబున నొప్పుచుండఁగా, నెదుటనున్న సభాకమలము ముకుకొనిపోయెను.

మరునాఁడు మంత్రిశేఖరుఁడు రాజాజ్ఞప్రకారముగా కళానిపుణులగు శిల్పుల రావించి, రాతికంబములపై నిట్లు శాసనమును జెక్కించెను.

"అఖండ భూమండలాఖండలుండైన, మనుజపురాధీశ్వరుఁడగు కరుణాకరునకు చాల వత్సరములనుండి సంతానభాగ్యము లేదు. సంతానములేమి, చింతాక్రాంతులై యున్న శ్రీశ్రీశ్రీ కరుణాకర మహారాజు

లకు సంతానలాభము గలుగఁజేయు మహాత్ము లెవరైన నున్న చో దర్శనమిచ్చి ప్రయత్నించుటకుఁ గోరుచున్నాము. ప్రభువులు సంతాన వంతులైన యెడల తత్కారకులగు మహామహులకు, అర్ధరాజ్య మిచ్చి, యనేక రాజసన్మానములు చేయబడును. ఎవరైన నున్న యెడల వారివారి మహిమలఁ బ్రదర్శింతురుగాక !''

సత్యకీర్తి,
మనుజపురాధీశ్వరుని మంత్రి.

ఇట్లు వ్రాసియుంచిన శిలాశాసనముల ననేక దేశములందునూ; తన రాజ్యమందుననూ, పాతించి యభీష్టఫలసిద్ధికొఱ కా రాజేంద్రుఁడు స్వాతివానకై నిరీక్షించు ముత్యపుఁజిప్పలవలే, యెదురుచూచుచుఁ, గాల మెటులో వెళ్ళబుచ్చుచుండెను.

సానందవనములో నున్న 'మంత్రశివానంద' యను నొక యోగి పుంగవుఁడు శతవత్సరములు బ్రహ్మజ్ఞానసంపన్నుఁడై ఘోరతప మాచ రించి, 'సంతానసంజీవి' యను దివ్యమంత్రమును బ్రహ్మప్రసాదమున బొంది, తన్మంత్రసిద్ధికై మఱికొన్నేండ్లు తప మట్లే సాగించి, దేశయాత్ర చేయవలెనను తలంపున, నిజశిష్యులను వెంటఁబెట్టుకొని బయలుదేరెను. అనేక దేశముల వీక్షించుచుఁ, బెక్కుమంది సంతానహీనులను, సంతాన వంతులుగఁ జేయుచు, వారివలన అనేక సేవలను బొంది, యానందిం చుచుఁ బెక్కు వటువులు దన్నర్థింప, వారిని దన శిష్యకోటిలోఁ జేర్చు కొనుచుఁ బోయిపోయి విదేహ దేశమును సందర్శించెను.

అచ్చట నా యోగిపుంగవుఁడు మనుజపురాధీశ్వరుఁడైన మన కరుణాకర మహారాజావారి సంతానయోగ్యతను గురించి వ్రాయించి యుంచిన, శిలాశాసనము నామూలాగ్రముగాఁ దిలకించెను.

చూచినదే తడవుగ నమ్మహర్షోత్తముఁడు తానట్టి మహిమగలిఁగి యుండుటచే, మిక్కిలి సంతోషించి, సత్వరముగ శిష్యసమేతుఁడై

మనుజపురంబునకుఁ జనియె. చని తత్పట్టణపరిసరప్రాంతములం దొక్క చక్కని జలాశయమును గాంచి, యచ్చట తనయొక్క జపానుష్ఠానుల నిర్వర్తించుటకు నిశ్చయించి, శిష్యులనందఱ ముందుగా నప్పురంబునకుఁ బనిచెను. పనిచి యంతకుమునుపే స్వీయ నిత్యకృత్యములు దీర్చుకొన్న వాఁడు గావున, వెంటనే స్నానముఁజేయ నుంకించినవాఁడై, దండకమండ లాదుల నాకోలన తటమ్మునందిడి ద్వివస్త్రధారియై, పాదప్రమాణ జలములఁ దిగి కొంచెమాగి, యా పద్మాకర రామణీయకంబు విలోకించు చుండెను.

మంచుమలవలె వెల్లనై యున్నతములైన హంసరాజము లా తామరలమధ్యనుండి వెలువడి, మందగమనములతో నా దివ్యపురుషుని దరి జేరుచుండెను. ముకుళితములైన సరోజములు తీక్ష్ణతరణి కిరణములు సోకుటచే బాగుగ వికసింప, నందు రాత్రంతయు మకరందపానాసక్తిచే బందీకృతములైన బంభరములు కళ్లు దెరచి సంతోషముతో, బంధము వాసెగదా! యని ఝంకారములు సేయుచు నాయసగోళములవలె నెగిరిపోవుచుండెను. ఎఱ్ఱగలువలు, తెల్లదామరలతో నిండియున్న యా తటాకమునందు జలవిహారము సల్పి యొకచో నిదిరించియున్న యంచలు నా యా పుష్పసారూప్యములగుటచేఁ బోల్ప నలవిగాకుండెను. మెల్లని పిల్లగాలులు వీచుచుండ నేర్పడు తరంగడోలికలమధ్య నూఁగులాఁడు పుష్పరాజములు, హంసరాజముల నించుక తట్టి లేపుచుండెను. గాలి త్రోపుడుకు గొన్ని జలజములు మాత్రము, యతీంద్రుఁడు ముందునకు వచ్చుట గాంచి దృఢకాయుఁడైన యాతని గజమను భ్రాంతిచే భయఁ పడి తమ నాళముల ద్రెంచునేమో యని, దూరముగ నేఁగ నుంకించు చున్నట్లుండెను.

మరియు నా జలాశయతీరమునఁగల రసాలవృక్షములపై కోయి లల జంటలు చేరి ప్రేమగీతములు పాడుచుండ, ప్రకృతియంతయుఁ ప్రేమమయమై యానందరసాబ్ధిలోఁ దలమున్కలు గాంచుచుండెను.

ఇట్టి సుందరదృశ్యమును దిలకించి, నయోగీంద్రుఁడు కొంతవడి యొడలెఱుఁగని యానందమనుభవించి, పిమ్మట నా సరస్సున స్నానముజేసి, జలంబుల వార్చి, యించుకసేపు ధ్యానానుష్ఠానపరాయణుఁడై, దివ్య మంత్రోపాసన గావించి, తదనంతరంబు, దండకమండల ధారియై నిజ శిష్యులఁ జేర పురంబులోనికిఁ బోయెను.

యతీంద్రులు పురప్రవేశము గావించిరనియు, వారిని జూచిన వా "రాతఁడు కేవలము సిద్ధుఁడే!" యనియు, సంభాషించుచుండిరి. వారి మూలమున, ప్రభువుల కోర్కె యీడేరునని రాజ్యప్రజలంతా యువ్వి ళ్ళూరుచుండిరి. రాను రాను "ఆ నోట - ఆ నోట" పురమంతా పై వృత్తాంత మల్లుకొనిపోయి, మహామంత్రి యగు సత్యకీర్తి చెవులఁ బడి యెను. విన్నదే తడవుగా నాతఁడు సంతోష పారవశ్యముచే సర్వమును మఱచినవాఁడై, కొంతవడికి దానా యోగీంద్రులను దర్శింప సంకల్పించి, భద్రగజ మధిష్ఠించి, రాజభటులు ముందు వేత్రహస్తులై బరాబఱులు సేయుచుండ, మంగళవాద్యఘోషములు రోదోంతరము నిండి చెలఁగ, మంత్రశివానందయోగిని చేరంజనియె.

చేరి శ్రీ యోగీంద్రుల దివ్యపాదకమలములకుఁ బ్రత్యుత్థాన మాచరించి, మృదుమధురభాషణంబుల నిట్లనియె.

"మహాత్మా! తమ రీ నేలను మెట్టుట మా పూర్వబహుజన్మ సుకృతము. ఎన్నియో వత్సరము లేకాగ్రతమై దివ్యతప మాచరించినను మీవంటి యతీశ్వరుల దర్శనభాగ్యము లభించుట దుర్లభము. తమ రే యే దేశముల నీక్షించుచు నిందు వచ్చితిరో? తెలియ వేడుకగా నున్నది. భవదీయ వాగామృతము గ్రోల నర్హులమేని యేతద్వృత్తాంత మాద్యంత మానతీయఁ గోరెదను." అనవుఁడు —

యోగిపుం :— మంత్రివరా! పుట్టినదాది దట్టఁపు టరణ్యముల లోనే గాపురముండి తపస్స్వాధ్యాయులమై, బ్రహ్మజ్ఞానసంపన్నులమై

ప్రపంచాతీతుఁ డైన, మా కొక దేశమనునది గలదా? పంచముల మొదలుగా గల దేశములన్నియు నవలోకించుచు భక్తజనులఁ దరింపఁ జేయుట కై యిటు వచ్చుచుంటిమి.

మంత్రి :— మహాత్మా! తమ కే విద్యలయం దైన, నారితేరి యుంటిరా?

యోగి :— ఒక విద్య యను మాట యేమి? విద్యలన్నియు మాకు కరతలామలకము.

మంత్రి :— యోగీంద్రా! మీ కే మైన దివ్యవరములు భగవానునిచే ననుగ్రహింపఁబడినవా?

యోగి :— అవును. పద్మసంభవునిచే "సంతానసంజీవి" యను దివ్యమంత్రమును బొందితిని. ఇంకను ననేకవరములు గాఁజేసితిని.

మంత్రి :— మహాత్మా! క్షమింపుఁడు. మీ మహిమ నరయుట కై వివిధప్రశ్నలచే మిమ్ముల శ్రమపెట్టితిని.

యోగి :— తప్పులేదు మంత్రివరా! తెలుసుకొనుట కడిగినదాన దోషము లేదు.

మంత్రి :— యోగివరా! మా మహారాజావారికి చాలకాలము నుండి, సంతానము లేదు. ఎన్ని ప్రయత్నములు జేసిననూ, ఫలితము శూన్యమయ్యెను. రానురాను ప్రభువుల విచారసాగరమునకు మేరలేకపోయెను. మీ రాకవల్ల మా జన్మ తరించినది. సత్వరము భవదీయ దివ్యమహిమచే మా ప్రభువులకు సంతానయోగ్యత గలుగఁజేయుటకు మిమ్ము వేఁడుకొనుచున్నాము.

యోగి :— ఇంతకుఁ బూర్వమే మీరు ప్రకటించిన శిలాశాసనము నవలోకించియుంటిని. మీ రాజావారి దర్శనమునకుఁ బోనుద్దేశించు నంతలోనే మీ రేఁగుదెంచితిరి.

మంత్రి :— ధన్యోస్మి. అటులైనచోఁ ద్వరగ దయచేయుఁడు భద్రగజము సిద్ధముగనే యున్నది.

యోగి :— నాయనా! నీవు తండ్రి వయితివా? లేకున్నచో నీ యాతిథ్యము.........

మంత్రి :— (తలవంచుకొని యూరక నిల్చియుండును.)

యోగి :— మంత్రిశేఖరా; గ్రహించితిని — గజమును సిద్ధపఱుపుము.

అమాత్యశేఖరుఁడగు సత్యకీర్తి భద్రగజముపై నొక బంగారు పీఠమును నిర్మాణము గావించెను. యోగీంద్రులు పీఠ మలంకరింపఁగానే, భద్రగజము వెనుక దానును హయారూఢుఁడై మంగళవాద్యఘోష ములు చెలఁగఁ గోటలోనికిఁ బోయెను.

మంత్రి సమేతముగా, యోగీశ్వరులు విచ్చేయుట గాంచి కరుణాకర మహారాజు హర్షభాష్పములు వెదజల్లుచు, సంభ్రమాతిశయములు పెనఁగొన సత్వరముగా బోయి, మంత్రశివానందయోగికి సాష్టాంగమ్ము గావించి, తోడ్తెచ్చి యుచితాసనాసీనునిం జేసి, నిజపత్ని బంగారుకుండతో నీరువోయ నా దివ్యపురుషుని పాదములు గడిగి, తత్పాదపవిత్రామల తోయములు శిరమున దాల్చి యిట్లనియె.

కరుణా :— మహాత్మా! నేఁడు మీ రాకచేఁ దరించినవాఁడ నైతిని. నా వాంఛ లీడేరునని యూశించుచున్నాను.

యోగి :— కరుణాకరా! నా కంతయుఁ దెలియును. నీ యాశయ మిప్పుడే నెరవేరును.

కరుణా :— ధన్యుఁడను, మహాత్మా! హోమములేమైన గావింప వలయునా?

యోగి :— అవేవియు నవసరము లేదు. ఏకాంత సౌధములో మూఁడు పూర్ణకలశ లుంచి, యందు సహకారవృక్షము యొక్క చిగురుజంట లుంచిన జాలును, చందన తాంబూలాది ద్రవ్యములుంచిన నుంచవచ్చును.

వల్లెయని, యా రాజేంద్రుఁ డట్లే దాసీజనంబుచేఁ బూజాగృహము శుభ్రముగ నలంకరింపఁజేసి, యోగీంద్రులు చెప్పిన రీతిగా, పరికరములు సిద్ధము చేయించెను. తదుపరి — మంత్రశివానందయోగి, మంత్రి భార్యను, రాజుభార్యకు సహచరిగా నుండవలసినదని యాజ్ఞాపించి, తక్కినవారి నావలకుఁ బంపివేసెను.

గది తలుపులు మూయించి, యాతఁ డేదియో కొంతవడి నిమీలిత లోచనుండై యుండి, తదుపరి తన కమండలోదకము నభిమంత్రించి యా పానీయమును, అచ్చటనున్న పూర్ణకలశలయం దొకదానిలో నించుక గలిపి, రాజపత్ని కందిచ్చి, అమ్మా! యీ పానీయమును మీ దంపతు లిరువురును చెరిసగముగా గ్రహించవలెను. అని చెప్పెను. అనంతరంబు మంత్రిభార్యను గాంచి, యామెకూడ సంతానము లేనిదై యుంట తెలిసినవాఁడు గావున, తన కమండలోదకములో నొకటి రెండు చుక్కలు మాత్రము రహస్యముగా వీడెమునం దునిచి, యామెను గనుంగొని, యమ్మాయీ! చాల శ్రమపడితివి. ఈ తాంబూలమును గ్రహింపుమని చేతికందిచ్చెను. సిద్ధుని నేత్రాభినయనము గాంచి, యామెయు గ్రహించినదై, "మహాప్రసాదము" ని యాతాంబూలమును గ్రహించెను. వెంటనే యోగీంద్రులును "రేపకడ వత్తు" నని చెప్పి కరుణాకర మహారాజు వద్ద యనుజ్ఞ గైకొని తన బస చేరుకొనియెను.

తదనంతరంబు, రాజపత్నియు, మనముప్పొంగ కోరిక లీరికలెత్త, చిరునవ్వు వెన్నెలల విరియించుచు, పతివద్దకు జేరి, సగము పానీయమాతని కందిచ్చి, శేషమును తాను గ్రోలెను. మంత్రిభార్యయు, వీడె

మును భుజించినదాది పట్టరాని యానంద మనుభవించుచు, నేవేవియో వెఱ్ఱిభావాలు మనసున గలయదిరుగ, యానాఁడే తనకు నూత్నయౌవన మంకురించినట్లు సొరుమీరియుండెను.

నాఁటిరాత్రి యా రాజదంపతులును, మిక్కిలి ప్రేమానురాగమున, స్వేచ్ఛగా, నెన్నఁడు నెరుగని యానంద మనుభవించుచు రతిక్రీడల యందు దేలిరి.

మంత్రిభార్యయుఁ, దనభర్తకు మిక్కిలి మక్కువ గలుగఁగఁజేయుచు, మోహావేశముచే నాఁటిరాత్రి యంతయు భర్తతోఁ గలిసి సుఖించెను.

ఆనాఁడు వారి వారి రతిక్రీడలు, పంచశరునిగూడఁ దృప్తిఁ బొందించెననుటలో నతిశయోక్తి యేమున్నది ?

మరుచటి దినమునుండియే, యమ్ముద్దరాలులు గర్భవతులైరి. ఆహా ! దైవసంకల్పము, నిజముగ నా యోగశిఖామణి భగవంతుఁడే ! కానిచో నింతటి యద్భుతమైన ప్రభావ మెట్లుండును. ఎంతకాలము నుండియో కడుపుపండక దుఃఖితులైయున్న, యమ్ముద్దియల నొక్క రోజులో గర్భవతులగున ట్లనుగ్రహించెను. ఇంతకును "కాలః సర్వస్య కారణమ్" యని గదా !

మరునాఁడు మంత్రి శివానందయోగి రాజాస్థాన మంటపమువద్ద నాసీనుఁడై, కరుణాకరుని దర్శనమునకై వేచియుండెను. యోగీంద్రుల రాక దెలిసినవాఁడై, రాజును సత్వరముగ, సంభ్రమమున సభా మంటపము జేరి, యోగీంద్రుల చరణకమలములకు నమస్కరించినవాఁడై, యాతని కొక యుచితాసన మందాసీనునింజేసి, తానును వేఱొక పీఠ మలంకరించి, కొంతవడి, కుశలప్రశ్న లేవియో ముగిసినపిదప నిట్లనియె.

కరుణా :— మహర్షివర్యా ! నేఁటితో మా కొఱంత తీఱునని తలంచుచుంటిని. నా ప్రకటన ప్రకారముగా మీర లంగీకరించి, నా రాజ్యమున యర్ధము గ్రహించి పాలింపుఁడు.

యోగి:— రాజశేఖరా! మావంటి జడులకు రాజ్యపాలన మొకటియా? నా కా తలంపులేదు. నీవు పుత్రవంతుఁడవై చిరసౌఖ్య మనుభవింపుము.

కరుణా:— యోగివరా! మీ రాడునది సమయోచితముగా లేదు. వ్యర్థప్రకటనమును గావించిన నా కీర్తికిఁ గళంకము రాదా? తప్పక స్వీకరింపుఁడు.

యోగి:— రాజ్యదాన ముభయులకూ ప్రమాదకరము. దేశము లన్నియు సంచరించి తిరిగి మా అరణ్యపుటాశ్రమమును జేరఁదలంచిన మా కీ రాజ్యపాలనము దుఃఖహేతువుగాఁదా? ఆమాత్రము వచించితి వంతియే చాలును.

కరుణా:— చిత్తము. కాని నా మనసంగీకరింపకున్నది. వివిధ దేశములలోను ప్రకటితమైన నా వాక్యములు దబ్బరచేసికొనుట కంగీక రించి యపకీర్తి నార్జింపఁజాలను.

యోగి:— అట్లైనచో మాకు గొంత ధనమిచ్చి, నీ యర్ధరాజ్య మును నీవే మరల కొనుక్కొనుము. ఇదియే బాగున్నది. దీన దోష రహితము.

కరుణా:— అటులైనచో వలసిన ధనమును గైకొనుఁడు.

అని వారికి కావలసిన ధనమును సంచుచులలోఁ గూర్పవోయించి, వీడ్కొలిపి యథాప్రకారముగా రాజ్య మేలుచుండెను. యోగిపుంగవుఁ డును మరి రెండు దినము లచటనే శిష్యకోటితో వసియించి కరుణాకరుని సత్కారములను సంపూర్ణముగా నంది మిక్కిలి సంతసించి, నిజశిష్యులతో వేఱొక దేశమున కరిగెను.

# 2 సన్నాహము

అది మూఁడవ మాసము. నిజపత్నుల గర్భధారణకు రాజును, మంత్రియు రహస్యముగా నుబ్బుచుండిరి. క్రమక్రమముగా నవమాసములు గతించెను. నిండుకుండలవలె నొప్పుచున్న యా గర్భవతులను జూచుకొలఁది, యమ్ముద్దియల పతులు ముప్పిరిగొను సంతసంబున ననుభవము చాలని యానందరసాబ్ధిలో మున్గితేలుచుండిరి.

అంత నొక్క శుభదివసంబున రాజుభార్య చక్కని కూఁతుని మంత్రిభార్య మన్మథుంబోలిన కుమారుని గనిరి. అమితోత్సాహమున రాజును, మంత్రియుఁ బుత్రీపుత్రోత్సవములను గావించిరి. ఈ వృత్తాంతమంతయు రాజ్యప్రజ లెఱింగి సంతోషమున ననేక పండుగలు, జాతరలు చేయసాగిరి. కాని యువరాజు పుట్టునను వారి యాశయము, భగ్నాశయ మయ్యెను.

భూమీధవుఁడును బ్రహ్మణోత్తముల రప్పించి, వారలకనేక గోభూహిరణ్యాది దానముల నర్పించి, వారి యనుమతిని పుత్రికి " విజయకుమారి " యని నామకరణము గావించెను.

మంత్రియు, సుతునకు జాతకర్మాదికృత్యములు యథావిధిగాఁ జరిపించి, " బుద్ధిమతి " యను నామధేయముంచెను.

శుక్లపక్ష సుధాకరుని చందంబున, నా బాలుఁడును, బాలికయు దినదినాభివృద్ధి నొందుచుండిరి. క్రొత్తగా పూచిన పూవుగనుక, నా బాలికను గోటనైన గిల్లక యా రాజదంపతు లల్లారుముద్దుగఁ బెంచుచుండిరి. మంత్రి బిడ్డఁడును తలిదండ్రులచే నతి గారాబముగాఁ బెరుగుచుండెను.

ఈ విధముగ నైదు సంవత్సరములు గడచినవి. అంత నా రాజదంపతులు తమ పుత్రికకు నక్షరాభ్యాసము గావించి యుపాధ్యాయుని

కడ చదువఁబెట్టిరి. మంత్రికుమారుఁడును నక్షరాభ్యాసుఁడై యాగురువు నొద్దనే విద్య నభ్యసించుచుండెను. శీఘ్రకాలములోనే వారిరువురును ధనుర్విద్యాది సకలవిద్యలయందు నారితేఱినవారైరి. రాజకుమారియుఁ బ్రత్యేకముగా సంగీత విద్యయందు మంచి నిపుణత్వము సంపాదించినది. సర్వశాస్త్రములయందు నిపుణత్వము సంపాదించి, సద్గుణోపేతు లనిపించుకొనిరి.

వారి విద్యాధిక్యతకు, సద్గుణములకు, రూపురేఖావిలాసములకు, వారి తలిదండ్రులును, ప్రజానీకమును చాల మురియుచుండిరి. పండితుల మొదలు, పామరుల వరకును, వారిని చూచినవారెల్ల "వీరిరువురకు జత సరిపడినదనియు ; ఘటనానైపుణి యీవిధముగా నుండవలె"ననియు కొనియాడుచుండిరి. భూసురోత్తములు వారిని జూచినపుడెల్ల "కళ్యాణ ప్రాప్తిరస్తు" అనియు, "దీర్ఘాయుష్యమస్తు" అనియు దీవన లిచ్చుచుచుండిరి.

ఆహారనిద్రావిహారములందు, నా బాలుఁడును, బాలికయు, నొండొరుల విడువక యొక ప్రాణంబువలె సంచరించుచుండిరి.

ఇట్లు కొంతకాల మేఁగిన పిమ్మట, నా రాజకుమారి యుక్త వయస్క యయ్యెను.

యుక్తవయస్సు వచ్చిన కూఁతుని చదువ మాన్పించి, యా రాజ దంపతులు పెండ్లిచేయ నుద్దేశించుచుండిరి. పిల్లకు పెండ్లిచేయడమన్న వారి హృదయములు తహతహ లాడుచుండెను. ఎవరినైన రాజకుమారునివరింపు మని కూఁతునకు చెప్ప సంసిద్ధులైరి.

మంత్రి కుమారుఁడును విద్యాభ్యాసము ముగించి, క్రొత్తగా 'కామకళాభ్యాస'ము చేయుచుండెను. నిమిషమైన నాతఁడు రాకుమారిని విడిచి యుండలేకపోవుచుండెను. రాజకుమారియు ప్రియుని ముఖము నీక్షింపక నొక్కక్షణమైన దాళలేకుండెను.

ఒకనాఁ డిరువురును ప్రాయముగలవా రగుటచే నేకాంతముగా నెవ్వరి కంటఁ బడకుండ యుద్యానవనమునకుఁ బోయిరి. అచ్చట నా ప్రేమికు లాటపాటలతోడ చిద్విలాసముగా సంచరించి, యొక రమ్యప్రదేశమందు గూర్చుండియుండ, ప్రియుఁడు, ప్రియను గని యిట్లనియె.

బుద్ధి :— విజయా! నీ తల్లిదండ్రులు నీకు పెండ్లిచేయ నిశ్చ యించిరట. మనమిరువురము నేకప్రాణముగా నుంటిమిగదా! నాకు పెండ్లి కానిదే నీవు పెండ్లియాడుట న్యాయమా?

విజయ :— నే నాడెదనని చెప్పితినా?

బుద్ధి :— కాకున్న నే నసృతమాడితినా? త్వరలో నీ వివా హము చేయుటకు నీ తల్లిదండ్రులు నిశ్చయించిరని వింటిని.

విజయ :— నే నింతలోఁ బరిణయమాడనని వారికి తెలియదు కాఁబోలు.

బుద్ధి :— నిన్ను వా రడుగలేదా?

విజయ :— లేదు.

బుద్ధి :— ఒకవేళ యడిగిన నేమి చెప్పెదవు?

విజయ :— ప్రస్తుతము పరిణయ మాడనని చెప్పెదను.

బుద్ధి :— ఎప్పుడైన వివాహము చేసికొనుట నిశ్చయమేగదా? అప్పుడు?

విజయ :— అప్పుడు మా టిప్పుడెందుకు లెద్దూ!

బుద్ధి :— విజయా! మన మిరువుర మేకకాలమందు పెండ్లి యాడవలె సుమా?

విజయ :— అది యెట్లు?

బుద్ధి :— నీవు పరిగ్రహించిన — మనము పిన్ననాఁటి ప్రేమికు లముగదా!

విజయ :— ఇది యెంతయు నసాధ్యమువలె దోఁచుచున్నదే! (అని నర్మగర్భముగా బలికి, యాలోచన నభినయించును.)

బుద్ధి :— ఏమి టా యాలోచన? విజయా! సాధించిన మనకు సాధ్యముకాని దున్నదా?

విజయ :— (చిరునవ్వుతో) ఏమో! నీదగు ప్రేమపాశము, నా మనమును ముందుకు లాగి, నీ దరి నపేక్షింపఁజేయుచుండ, నే నితరుని వరించకుండుట సాధ్యముకాదా!

బుద్ధి :— ఏమీ! ఇది యంతయు సమంజసమేనా? లేక, "కవిత్వ మల్లగలనో లేదో" యని పరీక్షించుచుంటివా?

విజయ :— వట్టి బేలవలె నున్నావే! ఆడినమాట తప్పుదు నను కొంటివా? సూర్యచంద్రాదులైన వారి గతులఁ దప్పవచ్చును గాని, నా మాట యన్యథా గానేరదు. ఒకవేళ కరుణాకరుఁడే వచ్చి, ఛీ! పో! యని తూలనాడినా — రాజ్యము వీడి పొమ్మన్నా — నా మాట తప్పదు, ఈ విజయ యెప్పటికైన నీదే!

బుద్ధి :— ధన్యుఁడను విజయా! మనలో నెవ్వరైన వేఱొకరిని ప్రేమించినచో, కాశిలో గోహత్య చేసిన పాపమును బొందఁగలవారము. ఇందులకు పంచభూతములే సాక్షులు.

విజయ :— నా మాట సాగునేమోగాని — నీ మాట సాగుట కల్ల.

బుద్ధి :— ఏ మట్లంటివి?

విజయ :— నా కొక సవతి యేర్పడునని జ్యోతిష్కులు చెప్ప వింటిని. తెలుసా!

బుద్ధి :— నీ మాటల కేమిలే! నిరతము నిండుప్రేమతో మన మొండొరులఁ బాయఁజాలక, మనుచుండ, సవతులు, గివతులు, యెచ్చట నుండైన యెగిరివచ్చెదరా? యేమి —

విజయ :— కావచ్చు – అయిననూ — మన మిప్పుడు వివాహము చేసికొనునంత యగత్యమేమున్నది ? ప్రస్తుతము మనము పెండ్లి చేసికొన్నచో మెడకు లంకెలు కట్టినట్లుండును. కావున యథేచ్ఛగా నిత్తఱి మనము దేశాటనము గావింపవలెనని కుతూహలము గలుగుచున్నది.

బుద్ధి :— నిజమే! నీ యభీష్టము నేను కాదనువాఁడను గాను. కాని — దేశాటనమన్న మాటలతోఁ బనియనుకొంటివా ? పండుకొనుటకుఁ దగిన తల్పముండదు. "సత్రము భోజనము, మఠము నిద్ర." సుఖనిద్ర లేనిచో శరీరాయాసము మిక్కుటమై దేహారోగ్యము చెడిపోవును. తెలుసా ?

విజయ :— నిర్ధనులమై దేశయాత్ర చేయుదుమా ? తగిన ధనమును బట్టుకొని బయలుదేరినచోఁ గష్టమెట్లు కలుగును ?

బుద్ధి :— వెఱ్ఱిదానా! అది మఱింత ప్రమాదకరము. అదియును గాక — నీ తండ్రి సంతానము లేమిచే బెక్కు వత్సరములు దుఃఖార్తుఁడై కృశించి, తుదకుఁ బరమయోగీంద్రుల ప్రసాదమున నిన్నుఁ గని యల్లారుముద్దుగాఁ బెంచెను. లేక లేక యొక్క కూఁతురవైన నిన్ను నిమిషమైనను నీ జననీజనకులు విడిచియుండఁగలరా ? పోనీ! చెప్పి పోఁదలంచిన మన పోకకు సమ్మతింతురా ? చెప్పకపోతిమేని దుఃఖమగ్నులై కృశించెదరు! శాల్యాన్నభోజనము చేయుచు, తీయని పానీయముల సేవింపుచు, దుకూలవస్త్రముల గట్టుచు, ఎండ కన్నెఱుగని సౌధమధ్యమున చెలికత్తెలతోడ చక్కఁగఁ గాలయాపన మొనర్చు నీ వా కఠినశిలాప్రదేశముల నడువఁగలవా ? అంధకారబంధురమైన యరణ్యమార్గములలోఁబడి, భయంకరమైన, మృగారావములు విన నేర్తువా ? చాలు చాలు! కోమలులు దేశయాత్రగోరరాదు. అన్నివిధముల నిత్తఱి దేశాటనము సమంజసముగా లేదని నా యభిప్రాయము.

విజయ :— సరే! నీ యిష్టప్రకారమే కానిమ్ము.

అని, చీకటి పడుటచే, యా నూతనప్రేమికు లుద్యానవనమును వీడి నిజసౌధముల కరిగిరి.

విజయకుమారికి వివాహము చేయఁదలంచినవాఁడు గావున నా మనుజపురాధీశ్వరుఁ డనేక రాకుమారుల చిత్రపటములను వివిధదేశముల నుండి తెప్పించి, పరిశీలించుచుండెను.

చూచిన చిత్రపటములనెల్ల నావల బారవైచుటయే కాని యాతని కొకటియు నేత్రానందము గలుగఁజేయదయ్యెను. ఇట్లు తెప్పించిన పటము లన్నియుఁ దిలకించి, విసుగుచెంది, చివరకు తన కూఁతునకుఁ దగిన వరుఁడు లభించువరకు వివాహము చేయనని నిశ్చయించుకొనెను. కాని — దైవ మూరకుండునా ? — అంతకు మునుపే విజయకుమారిది గ్రహించి తాను మంత్రికుమారుఁడగు బుద్ధిమతిపై మనసు లగ్నముచేసి యుండుటచే, చప్పున తన చిత్రలేఖనా నైపుణ్యము సఫలము చేయఁదలంచి, మంత్రి చిన్నవాని ఛాయాపటము రాజకుమారుని రూపములోఁ దయారు గావించి పరిచారికచేత దండ్రివద్ద కంపెను.

రాజు, కరుణాకరుఁ డదిచూచి నివ్వెరపాటుచెంది, సంభ్రమాశ్చ ర్యములు పెనఁగొన "ఏమీ! కళాచిహ్నములు! రూపురేఖావిలాస ములఁ బరిశీలింప నీ చిన్నవాఁడు నా కూతుం బోలియున్నవాఁడు. ఇది కలయా! లేక నిజమా ?" యని పరిచారికను గని —

కరుణా :— పరిచారికా! ఎవ్వరి దీ ఛాయావిగ్రహము ?

పరిచా :— ప్రభూ! కుంతలదేశాధీశ్వరుండైన చిత్రసేనమహా రాజావారి యేకైక పుత్రుఁడు, యువరాజు శమనసింహునిది.

కరుణా :— ఏమీ! చిత్రసేనుఁడు గతించుసరికి నొక్క స్త్రీ సంతానము దప్పించి, పుత్రు లెవ్వరును లేరని వింటినే ?

పరిచా:— కలిగియుండవచ్చు. లేనిచో చిత్ర మూరకే పుట్టునా? ప్రభూ!

కరుణా:— అట్లయిన నీ చిత్రమును పంపినవా రెవరు?

పరిచా:— యువరాజు సోదరి. వసుంధరీదేవి.

కరుణా:— సరే! రమ్ము. అమ్మాయి యభీష్టమును కనుగొందము. (ఇద్దఱు పోవుదురు).

కరుణా:— అమ్మాయీ! నీ వీ చిత్రపటమును జూచితివా?

విజయ:— (చూడనిదానివలె నాతృతగఁ జూచి) తండ్రీ! ఎవ రీ రాకుమారుఁడు.

కరుణా:— ఈతఁడు కుంతలదేశాధీశ్వరుండయిన చిత్రసేనుని యేకైకపుత్రుఁడు శమనసింహుఁడు.

విజయ:— ఓహో! చాల చక్కగ నున్నది.

కరుణా:— అమ్మాయీ! ఈ ఛాయావిగ్రహుఁడు నీకు తగిన వరుఁడేనా?

విజయ:—(అంగీకార సూచకముగా తలయూపి) నాన్నగారూ! ప్రస్తుతము నాకీ వివాహ మెందుకు? కొన్నాళ్ళాగి చేయరాదా?

కరుణా:— కుమారీ! యుక్తవయస్సు వచ్చిన పిల్లకు పెండ్లి చేయుకుండుట భావ్యము కాదు. నీకు వివాహము గావించి, నీవును నీ భర్తయు రాజ్యాధిపత్యము వహించియుండ, చూచి సంతసించుటకు మా మనము లెంత యువ్విళ్ళూరుచున్నవో, తెలియునా? నీ మీఁదనే పంచప్రాణములు పెట్టుకున్న మాకిట్లు జవాబీయనగునా? తల్లీ! త్వరలో నీ పెండ్లి గావించి, రాజ్యభారము గొంత నా తలపై నుండి తగ్గించుకొన వలయునని, యాశించుచుంటినే. నా యీ యాశయమును భగ్నము చేయుదువా?

విజయ :— నాన్నా! మీ మాట కడ్డుచెప్పుదునా ? మీ యుద్దేశమే నా యుద్దేశమున్ను. మీ రన్నట్లే కానిండు.

కుమార్తె యీ విధముగఁ దన యాశయము నెరవేర్చినందులకు కరుణాకర మహారాజు సంతసించి, అచ్చటనేయున్న వేటొక పరిచారకుని గని " ఓయీ ! నీవు సత్వరముగఁ గుంతలదేశమునకుఁ బోయి, విజయ కుమారి ఛాయాపటమునుగూడ చూపి, వార లంగీకారమును తెలియఁ జేయుము. యువరాజు సోదరి యగు వసుంధరీ దేవితో, విజయకుమారి తా నా రాజకుమారుని వరించిన సంగతి తెలియఁజేయుము. ఈ చిత్రపట మును పంపినందుల కామెకు మా కృతజ్ఞత యని చెప్పి, . త్వరలో తిరిగి రమ్ము." అని చెప్పి యంతిపురంబున కరిగెను.

సేవకుఁడు వల్లెయని కుంతలదేశమునకుఁ బోవ సిద్ధముగానుండెను.

రాకుమారి యిది విని, యంతయు గ్రహించి, తన ప్రయత్నము విఫలమగునేమో ? యని భయపడఁజొచ్చెను. ఆమె తన తెలివి తక్కు వకు, తొందఱపాటునకు మిక్కిలిగ నొచ్చుకొనజొచ్చెను.

" ముందు వెనుక లాలోచించక చేసిన పని యిట్లే యుండునుగదా ! "

# 3 ప్రయత్నము ; ప్రయాసము :

నిజముగా కుంతలదేశాధీశ్వరునకు పుత్రసంతానము లేదు. ఆయన యేకైకపుత్రిక ' వసుంధర ' యొక్క తెయే గలదు. ఆమెయే రాజ్యపాలనము మంత్రి సూతగా జేసికొని చేయుచుండెను.

" పన్నిన పన్నాగము ఫలించక బోవునా " యను పట్టుదల విజయ కుమారికి గలిగెను. ఆమె యెట్లయిననూ మంత్రిచిన్నవానిని కుంతలదేశ మునకు బంపించి రహస్యముగా కార్యము సాధింప నెంచెను. " తండ్రి

నిజముగనే భావించెను. సేవకునిగూడ పంపించెను. అతఁడు నిజముగ నిప్పుడే పోయినయెడల రహస్యము బయలుపడును. తండ్రికి తెలిసినచో మంత్రికుమారుని వివాహమాడుటకు సమ్మతింపఁడు. తెలియక చేసినచో నాతని తొందర ముప్పు తెచ్చును." అని యిట్లెన్నియో లేనిపోని యపోహలు తన మనస్సును కలవరపఱుప, నించుక ధైర్యము వహింపుచు నెట్టకేలకు మంత్రికుమారుని రహస్యముగా రావించి యిట్లనియె.

విజయ :— ప్రియా! నిన్నెందుకు రప్పించితినో యెరుగుదువా?

బుద్ధి :— తెలియదు. కేళీవిహారమునకని యూహించుచుంటిని.

విజయ :— పొరబాటు. నీ వొక సాహసకార్య మిపుడు చేయ వలసియున్నది.

బుద్ధి :— నీవు నా దరి నుందువా?

విజయ :— ఉండుటకే యిది చేయుట, మా నాన్నగారు నాకు వివాహము నిశ్చయించిరి. నేను నీ తాలూకు ఛాయాపటమును రాజ లక్షణములతో వ్రాసి రహస్యముగా బంపితిని. నీవు కుంతలదేశాధీశ్వరుండైన చిత్రసేన మహారాజు కుమారుఁడవని, పేరు శమనసింహుఁ డని చెప్పితిని, తండ్రి యంగీకరించెను.

బుద్ధి :— చాల చిత్రముగా నున్నది. చిత్రసేనునకు సంతానము గలదా?

విజయ :— ఒక్క కుమార్తె మాత్రము గలదు.

బుద్ధి :— ప్రస్తుత మేమందువు? చాల యసంభవముగా నున్నది. ఇంతటి తెలివితక్కువ, తొందరపాటు పని నీవు చేయుదు వనుకోలేదు.

విజయ :— జరిగినదేదియో జరిగిపోయినది. ఇప్పు డుపేక్షించినచో మరింత ప్రమాదకరము. సాధించిన మానవునకు సంభవము కాని దుండునా?

బుద్ధి :— ఆ యుపాయ మేదో నీవే చెప్పుము.

విజయ :—ఉపాయమున కేమున్నది? నీవు వజ్రవైడూర్యమాణిక్యముల నెక్కువగఁగొని కుంతలదేశమున కరుగుము. అరిగి యచ్చట నవి విక్రయించి యా ధనముచేత చక్కని రాజసౌధము నేర్పఱుచుకొని యుండుము. నేను పరిణయవిషయమై పోవు పరిచారకుని యచ్చటికే పంపించుదును. నీ వంగీకారమును దెలిపి వివాహమునకై, రాజకుమారుని దుస్తులతో రాజచిహ్నములతో బయలుదేరి రమ్ము.

బుద్ధి :—అబ్బో! యిది చాల కష్టమైన పని. కాని — నే నంపు యంగీకారపత్రముపై యా దేశపు రాజముద్ర యెట్లుండును? రాజముద్ర లేనిచో దొంగపత్రమని మీ తండ్రి పోల్చడు?

విజయ :— చాలఁ జక్కగ యోచించితివి. (ఇంచుకసేపు ఆలోచించి) సరే! అదియు సాధ్యమైనది. మా నాన్నగారి తండ్రి కుంతలదేశమును జయించునప్పుడు పెక్కు రాజాభరణముల గైకొని వచ్చిరి. అందొక రత్నాంగుళీయకముపై వారి రాజముద్ర యున్నది. ఆ యుంగరము మాత్ర మిక్కడనే చిక్కియున్నది. అది నీకిచ్చెదను. నీవు ఊ యని బయలుదేరినచో నన్నియు సాధ్యములే యగును.

బుద్ధి :— సరే! నీ యిచ్చవచ్చినయట్లు చేయుదును.

అని చెప్పి ప్రేమావేశమున మరల నెన్నాళ్ళకో రాజకుమారిని గాంచుట యని, ఆమె నొక్కసారిగా తన కౌఁగిట జేర్చుకొని సరససల్లాపములచేత కొంతవడి యచ్చటనే మెసలి, యామె యిచ్చిన రత్నాంగుళీయకమును, వజ్రవైడూర్యములను గ్రహించి, తన యింటికేఁ బోయెను. రాజకుమారియుఁ దన తండ్రి పంపించనున్న పరిచారకుని రహస్యముగఁ బిలిపించి "ఓయీ! నీవు మాత్రము నేను చెప్పువరకు నీ యింటనే రహస్యముగా మెలగుచుండుము. ఇదిగో! యీ సొమ్ము గైకొనుమని వేఁడుకగా నిచ్చి, యాతని నందుల కొప్పించి, యింటికిఁ బంపివేసెను. వాఁడును

చాల సంతోషించి యొరుల కంటఁబడకుండ తన యింటనే గోప్యముగా మెలగుచుండెను. ఎట్లయిన మంత్రిచిన్నవాఁడు కార్యము సాధించు నని, రాకుమారి దృఢనిశ్చయము చేసికొని, కొంతసే పేమేమో, యాలోచించి కొనుచు నట్లేయుండి తదుపరి తనకై యలంకరింపఁబడిన పడకగది జేరి, తత్శయ్యపై మేను వాల్చెను.

ఆ రాత్రి యెట్లో గడచినది. మరునాఁ డుదయముననే మంత్రి కుమారుఁడు మేల్కాంచి, కాలకృత్యంబులు నిర్వర్తించుకొని, మజ్జన మాడి, సూర్యోపాసనానంతరము, యగ్నికృత్యంబుల నిర్వర్తించి, యుల వాటు ప్రకార మొకింత శీతలాన్నమును భుజించి, వజ్రవైడూర్య మాణిక్యముల, సంచుల గూర్చివేసి, పట్టుకొని, రాకుమారిడిన రత్నాంగుళీయకమును, వ్రేలిని ధరించి, తీర్థయాత్రకు బోఁదలంచినవాఁవివలె నభిన యించుచు, తండ్రివద్ద శెలవుగైకొని, యిరువుర సేవకులను సాయకులుగా తీసుకొని పయనమై పోయెను. వారు పోవుచు మధ్యాహ్నమగుసరికి పల్లె నొకటి చేరుకొనిరి. అచ్చట బసచేసి, వారలు కట్టుకున్న పదార్థము లను, కొంచెము వండుకొని, భోజనకార్యము ముగించి యించుక విశ్ర మించి, మరల ప్రయాణము చేయసాగిరి. ఎంత నడచిననూ, బయలు ప్రదేశములే గాని వారల కొక పాడుగృహమైనను కానరాదయ్యెను. రానురాను సూర్యాస్తమయ మగుసరికి వారలేఁగు దారి యొక యరణ్య మార్గముగుండ పోఁజొచ్చెను. పతంగబింబ మప్పుడే యెరుపుబాఱి పశ్చి మాంబుధిలోఁ బడజొచ్చెను. పక్షులు బారులు తీర్చి యాకాశపథము నుండి పర్విడుచుఁ దమతమ గూండ్ల జేరుకొనుచుండెను. ప్రియున్నే హితుఁ డస్తమించెగదా! మనమింక విప్పారిన ముఖములతో నుండుట పాడిగా దనునట్లు పద్మవారము ముడుచుకొనిపోయి, తమ కాశ్రయ మిచ్చిన జలాశయములను చిన్నబుచ్చెను. మేఁతకై పోయిన సారంగతండము, మేఁత చాలించి, యధికోత్సాహముతో కాళ్లు పైకెత్తి తమతమ పొదల

లోనికి గంతులు వేయుచుఁ బోవుచుండెను. తల్లి తెచ్చియిచ్చు నోగిరము గుఱుచుటకై లేఁతకూఁత లిడుచు రెక్కలురాని పిల్లలు, గూండ్లనుండి తమ తమ తల్లుల రాకకై యెదురు చూచుచుండెను. నీలిచీర గట్టుకొని సంధ్యాకాల చీఁకటి యను కాంత యప్పుడే ప్రవేశించుచుండెను.

చేరువ నేపల్లెయుఁ గానరాకపోవుటచే మంత్రికుమారుఁ డచ్చటనే యున్న యొక వటవృక్షముక్రింద నిజసేవకులతో బసచేసి, చేరువనున్న యొక జలాశయమున కరిగి, స్నాతుఁడై, సాయంకాల సంధ్యాకృత్యములు నిర్వర్తించుకొని వచ్చెను. వంటసామగ్రి తగినట్లుగా గలవారగుటచే యిష్టములగువానిని వండుకొని భుజించి, కొంతసేపు తమ ప్రయాణమును గూర్చి ముచ్చటించుకొనుచు యా చెట్టుక్రిందనే మేనులు వాల్చిరి. శరత్కాల హిమధాముఁడు, తన చల్లని కిరణములచే వారి మార్గాయాసమును బోగొట్టుచు, నా యమాయికులఁ బ్రేమతో సాకుచుండెను. వరి శరములను పదిలపఱచి సేవకు లల్లన పవ్వళించిరి. నాఁటి రాత్రి ఆ భూదేవాత్మజుఁడు కొట్టిన పామువలె నిద్రపోసాగెను.

అంత దరిలోనున్న యొండొక వటభూజమునందున్న మర్కటంబు లరుదెంచి, మంత్రిపుత్త్రుని తలక్రిందనున్న రత్నపు మూటలను పెకలించి యెత్తుకొని పోయెను. గాఢనిద్రా పరవశుఁడై యొడలెరుగక యున్న యబ్బాసురార్భకుఁడేమి గానఁగలఁడు. చూచినను నేమిచేయఁగలఁడు? సూర్యరశ్మి బాగుగ మేనిపై సోకువరకు వార లట్లే నిద్రించియుండిరి. తెలివిగాంచిన మంత్రికుమారుఁడు ధనరాసులు గానక తెల్లబోయి చింతింప సాగెను. భటులును మొగములఁ దేలవైచిరి. అరమైలు దూరములో గాలించి వెదకినను ధనపుసంచులు గానరావయ్యెను. ప్రాతఃకాల నిత్యకృత్యములనుగూడ విస్మరించి, యయ్యమాత్యపుత్త్రుఁడు, చింతాక్రాంతాత్ముండై పన్నిన పన్నాగము ఫలించకపోయెగదా యని మతిహీనుని వలె వెఱ్ఱిచూపులఁ జూచుచు, నిజాత్మ నిట్లు తలపోయసాగెను. "హా!

దైవమా! ఎంత మోసపోయితిని. ప్రేమానుబంధముండగా మా కీయెడ బాటు యేమి? ప్రియురాలికై కొండంత యాసజేసుకొని కుంతలదేశము పోనున్న నన్ను తిరిగి యింటికే మరలించెదవా? మరలిపోయిన నా ప్రియ ప్రియవదనము నీక్షించు టెట్లు? ఎన్ని యాపదలకైన నోర్చి కుంతల దేశము చేరిననూ సాధంబు నిర్మించు టెట్లు? ధనరాసులు పోయినవి, నిర్మించిననూ శమనసింహుం డనిపించుకొనగలనా? విజయను వివాహ మాడఁగలనా? ఇది యంతయు వృథాప్రయాసవలె గాన్పించుచున్నది. పోనీ! యింటి కేఁగెదనంటినా? అదియు నసంభవము. పోయి రాకుమారి నెట్లు గాంతును. ఆమె నన్నెంతయో నిందింపకమానదు. హా!. విధీ! ఎటులైన యీ నిర్భాగ్యుని కుంతలదేశము జేర్చుము." అని వాపోవుచుఁ గన్నులు — బరువెక్కఁగా నించుకసేపు నిద్రపోసాగెను. భటులును విచార గ్రస్తులై యట్లే యాహారములు మాని కూర్చుండిరి. దినకరుని తీక్ష్ణకిర ణము లప్పుడప్పుడే ప్రశాంతి వహించుచుండెను. రానురాను ఆకసమం తయు వానమబ్బులచే నిండిపోఁజొచ్చెను. సూర్యభగవానుఁ డా కాఱు మబ్బుల చాటున తన ముఖమును దాఁచుకొనియెను. చిన్న హోరుగాలి బయలుదేరి యా మబ్బులను దొలఁగఁ జేయుటకు ప్రయత్నించుచుండెను.

మంత్రికుమారుఁడు మేల్కొని సేవకులతో ప్రయాణము చేయ సాగెను. అతనిమనమెంత ధైర్య మవలంబించుచున్ననూ, దైవము భయంకరాకారము దాల్చి భీతిగొల్పుచుండెను. క్రమక్రమముగా నా గాలి మరింత పెద్దదై ప్రళయకాల ఝంఝామారుతమువలె వీవసాగెను. ఒంటిగానున్న వృక్షము లన్నియు నేలఁ గూలుచుండెను. కాళ్ళ ప్రయత్న మక్కరలేకయే వారలు దూరముగా నరుగుచుండిరి. ఇంతలో జడివాన కురియ నారంభించెను: అశనిపాతముల రాళ్ళులు హోరుగాలితో గలసి మరియు నా జడివానకు, వనసత్వములన్నియు, కలగి పారిపోవుచుండెను. పారిపోవ నుంకించినంతనే ప్రాణము లెగిరిపోవుచుండెను. పక్షుల కోలా

హాల మధికమగుచుండెను. వ్యాఘ్రముల రావములు మితిమీరుచుండెను. మేఘగర్జనలలో పంచాననముల భీకరగర్జనలు వినరాకుండెను. పులుల గాండ్రింపులకు భయపడి దుప్పులు తత్తఱపాటుతోఁ బారిపోవుచు దారి గానక పొదలలోను, డొంకలలోను చిక్కుకొని పోవుచుండెను. మంత్రి కుమారుఁడును, భటులును నొకరి నొకరు తెలిసికోలేని స్థితిలో నుండిరి. కుండలతో వంచినట్లు వాన కురియుచుండెను. కొంతసేపటికి కొండలపై నుండి జారిన ఝురీప్రవాహము లన్నియుఁ గలసి, మహానదివలె యరణ్య మార్గముగుండా వచ్చుచు చెట్లను పడద్రోయుచుండెను. భటు లంతకు మునుపే బలిష్ఠమైన వృక్షము నెక్కి కూర్చుండుటచే ప్రమాదమునుండి తప్పించుకోగల్గిరి. పాపము! భూసురార్భకుఁ డుపాయ మేదియుఁ గానక యా ప్రవాహములో కొట్టుకొనిపోయెను. బాగుగా యీఁత పాటవము గలవాఁడైననూ యాతఁ డొడ్డు చేరఁజాలక మునుఁగుచుఁ దేలుచు పోవు చుండెను. కొంతదూర మట్లు పోయిపోయి యొక తెప్ప నాతఁడు గాంచి, యందులోని కెగఁబ్రాకి కూర్చుండి, కొంతసేపట్లే ప్రవాహములో జీవిత మరణముల మధ్య నూఁగులాడుచు తీరము చేరుకొనియెను.

"హా! విధీ! ఎట్టి సుకుమారున కెన్నికష్టములు తెచ్చిపెట్టితివి. ఇన్ని కష్టముల కొరకు స్త్రీహృదయమే గద మూలకారణము."

ఈ విధముగ నెట్టకేలకు తీరము చేరుకుని ప్రాణముల కుదుట పఱచుకొనినవాఁడై, యా యమాత్యనందనుండు, పరిసరప్రాంతములయం దేదేని పల్లె యుండకపోదను తలంపుతో నందం దక్కడక్కడగల వింతల నరయుచు మెల్లగఁ బోవుచుండెను.

కొంత దూర మా విధముగఁ బోయి పోయి, యొక పల్లెనైన గానక, మార్గశ్రాంతుండై, విశ్రాంతిగైకొన నెంచి, యొక రసాలవృక్షము నీడలో నొయ్యన మేనువాల్చెను. మిక్కిలి బడలియుండు కతమున నా చిన్నవాఁడు మేను వాల్చినదే తడవుగా గాఢనిద్రావశుఁడయ్యెను.

" పాపం! తా నొకటి తలంచిన దైవ మొకటి తలంచుచున్నది. ఎంత యదృష్టవంతుఁడైనను, నాతని తలపై పెద్దమ్మ తాండవ మాడు చునే యున్నది. అంత సుకుమార శరీరమును కందిపోయి, యెఱ్ఱని శిల వలె తయారైనది. కాని యీ బాపని మనసుమాత్రము మరింత ద్రవించు చున్నదే కాని దిట్టపడు టావంతయును లేదు. హా! విధీ! యెందైన సుకుమారులకును, నమాయికులకే గదా? కష్టములు. ఒక్క నారీరత్న మునకై హృదయమిచ్చి భరింపరాని కష్టములకు లోనయ్యెను. చివరి కైన, నా యువకుని మనోరథము ఫలితార్థమగునో? కాదో?"

కోడివారల పీడి, యేకాకియై, గాఢనిద్రాపరవశుఁడయిన యీ యువకుని కింకను దీరని కష్టములు తెచ్చిపెట్టుచుండు దైవము నేమనఁ గలము? విధియే విఱ్ఱవీగి విజృంభించినచో నెదుర్కొనువా రెవ్వరు?

ఇట్లు పవళించియున్న యీ భూసురోత్తముని యందచందములకు భ్రమసి యొక రక్కసి యాతని దరిచేరెను. చేరి వానిని చంపుటకు నిచ్ఛ గింపక యెట్లైన నా యువకుని బొంది సుఖింపవలెనని మోహాముతో, తన మాయాసౌధమునకు మంత్రప్రభావమున దీసికొని పోయి యచ్చట వాని నొక శయ్యపైఁ బరుండపెట్టి యడవిలోని కాహారార్థమై పోయెను. కొంతసేపటి కా మంత్రినందనుఁడు మేల్కాంచి, కంటికింపగు సౌధమునందు తా నుండుట గని, సంభ్రమాశ్చర్యములు పెనఁగొన " ఏమీ! వింత? నే నిక్కడ కెట్లరుదెంచితి? ఇది కలకాదుగదా! వస్తుజాలమును బరికింప రాజసౌధమువలె నున్నదే. ఇతియుంతియు నింద్రజాలమువలె నున్నది. అదిగో! ప్రభాకరుని లేఁతకిరణము లీ గవాక్షమునుండి మేనిపై సోకు చున్నవి. పక్షుల కిలకిలారావములు మిన్నుముట్టుచున్నవి. పోయి సం ధ్యాదికృత్యములు నిర్వర్తించుకొనెదగాక!" అని చింతించి తత్క్షణ మా శయ్యదిగ్గి, సౌధము వెలుపలికి బోయి చూడ, నడవికింబోయిన రక్కసి వచ్చుచుండుట గని భయకంపితుఁడై, చివాలున వెనుకకు మరలి, తిరిగి శయ్యపైఁ గూర్చుండి దీర్ఘాలోచనాపరుడయ్యెను.

కడుపార మాంసభోజనము గావించినదై యా రక్కసి మంద ముగ నడుగు లిడుచు, తనదారి కడ్డముగనున్న వృక్షముల నేలఁ ద్రోసి వేయుచు, చేతనున్న పుత్త్రిలఁ బారవైచి, సౌధము సమీపించుటచే చక్కని సుందరీమణి వలె తయారై లోనికిఁ బోయెను.

రక్కసి నిజరూపమును గాంచినవాఁడు గావున నా సుందరి, రక్కసియై యుండనోపునని నిశ్చయించి, యా మంత్రినందనుఁడు వెనుకంజ వేయఁజొచ్చెను. ఏమి మాట్లాడుటకు నాతని నోరు పెగలలేదు. ఆ సుంద రియును క్రీఁగంటి చూపుల నాతని జూచుచు మందగమనములతో దరి జేరెను. పాప మా యువకుఁడు నిలువెల్ల నీరై పోవ, నల్లే శిలావిగ్రహము భాతి కూర్చొని యుండెను. సుందరియు నల్లే యువకుని వీక్షించుచు వికటాట్టహాస మొనరించెను. అతఁ డయ్యది గ్రహించి, యామె నిక్క ముగ రక్కసియే యని మరింత భీతిల్లఁజొచ్చెను. తా నొనర్పవలసిన కార్యమంతయు నొక్కసారి తలంపునకు రాగా, విజయకుమారి పల్కిన పల్కులను స్మరించుచు, ధైర్యము తెచ్చుకొని తన యెదుటనున్న మాయాస్వరూపమును గాంచి, యిట్లనియెను.

మంత్రికుమా :— ఓసీ ! నీ వెవ్వరవు ?

సుం (రక్కసి) :— మరల మాట్లాడక వికటాట్టహాస మొన రించును.

మంత్రికు :— ఏమిటానవ్వు. అడిగినదానికి జవాబు చెప్పు.

సుంద :— రాజా ! మేల్కాంచితిరా !

మంత్రి :— నేను రాజునుగాను, బాపఁడను.

సుంద :— మాటవరుస కట్లంటిని. కోప మేల ?

మంత్రి :— ఇంతకూ ఎవరు నీవు ?

సుంద :— నేనుమృగంధరుఁడను రాజుకూఁతురను. నా పేరుసుశీల.

మంత్రి :— నేనొక చెట్టుక్రింద పరుండియుండ నిటకెట్లు వచ్చితిని?

సుంద (సుశీల) :— నా మంత్రశక్తిచే.

మంత్రి :— చాల నంగనాచివలె గన్పడుచున్నావు. కనఁబడిన పరపురుషులనెల్ల మంత్రబలముచే తెప్పించుట మీా రాజలక్షణమా? లేక రాక్షసలక్షణమా?

సుశీల :— కాదు రాజా! నీవంటి సుందరాకారుఁడు తప్ప నా సౌధమునకు వే ఱొక్కఁడు రా నర్హుఁడు కాఁడు.

మంత్రి :— నీవు నన్ను తెచ్చిన తొల్లిటి ప్రదేశమందు విడిచి పెట్టుము.

సుశీల :— నిన్ను వదలివేయుటకా? యింతదూరము తెచ్చినది?

మంత్రి :— వదలివేయక యీా యడవిమృగముల నోటిలోఁ బారవేయుటకా?

సుశీల :— ఎంత వెఱ్ఱివాఁడవు రాజా! నీతో గూడి రతిక్రీడల దేలుటకు.

మంత్రి :— ఛీ! చాలుచాలు. మీా యాఁడువాండ్రింతకైన తగుదురు.

సుశీల :— తగినవారు గనుకనే నిన్ను కుంతల నగరంబునకు ప్రయాణము చేయించి, యడవిపాలు చేయుట; మంత్రశక్తిచే రప్పించు కొనుట.

మంత్రి :— (ఆశ్చర్యముతో) ఏమీా! నీకీ వృత్తాంత మెట్లు తెలియును, మఱేమైన తెలిసినదా?

సుశీల :— తెలియని దిందులో నేమున్నది? సావధానముగా నాలించిన నన్నియుఁ దెలియును.

మంత్రి :— చాల చిత్రముగా నున్నదే! సుశీలా! నీ వీ నిర్జనారణ్యమున నుండుటకు గారణ మేమి?

సుశీల :— రాజా! నేను మంత్రప్రభావము నెఱిగినదానను గాన, నే నా రాజ్యములో నుండుట వేరొక విధముగా భావించి, నా తండ్రి నన్నీ యరణ్యప్రాంతములో విడిచిపెట్టి, రాజ్యములో నడుగుపెట్టవలదని శాసించెను.

మంత్రి :— ఓహో! దూరదేశములో నున్న, వారిని, రప్పించ లేరనియా? నీ తండ్రి యభిప్రాయము?

సుశీల :— తండ్రి యాజ్ఞకు కట్టుబడి యుంటినిగాని — చూడ నాకసాధ్య మెందును లేదు. ఎంత దూరములో నున్నవారినైన నే నవలీలగా రప్పించఁగలను.

మంత్రి :— అట్లయినచో సుందరీ! నన్ను వెంటనే కుంతలదేశమునకు బంపివేయుము.

సుశీల :— ఓహో! అప్పుడే కుంతలదేశమునకే ప్రయాణము చేయుచున్నావు. ఏమంత తొందర?

మంత్రి :— త్వరగా పోవలయును. తత్క్షణమే పంపివేయుము.

సుశీల :— మరి నీ విజయకుమారి వృత్తాంతమును చెప్పనక్కఱ లేదా?

మంత్రి :— అట్లయినచో? త్వరగా చెప్పుము. నే పోవలయును.

సుశీల :— (పెద్దగా నవ్వి) నా కా సంగ తెట్లుతెలుసును? నాఁడా వృక్షముక్రిందఁ బరుండి నీవు పలువరించిన మాటలఁబట్టి యట్లంటిని. కాని వేరొకటి నాకు తెలియదు.

మంత్రి :— నేను నిద్రలో పలువరించితినా? మొదటనే నుడువవైతివేమి? మంత్రమహిమ యున్నదంటివే!

లేచి నలువంకలు పరికించుసరికి చేరువ నొక మునీశ్వరుఁడు నిలుచుండి, యమృతోపమానమగు తనప్రేమవీక్షణముల నయ్యువనీసురార్భకునిపైఁ బరపుచుండెను. అదికూడ రాక్షస మాయయే యని భ్రమించి, మునీశ్వరుని నమ్మఁజాలక నా యువకుఁడు రోషారుణితలోచనుండై "ఓసీ!! రాక్షసీ! ఎన్ని పన్నాగములు పన్నుచుంటివి. నీమాయలింక సాగవు. కాచుకొమ్ము. నిన్నిప్పుడే వధించెదను." అని మేఘగంభీరభాషణముల వచింపుచు తటాలున యడిదంబొరనుండి వెలికూడ్చి, ముందున కురకఁబోయెను.

యోగి :—నాయనా! శాంతింపుము. ఇక్కడ రక్కసు లెవ్వరు లేరు. నిన్ను బంధించిన యా రాక్షసి చాల దూరముగ నున్నదిలే.

మంత్రికు :—అట్లయిన మీ రెవ్వరు? నేనిక్కడి కెట్లు వచ్చితిని?

యోగి :— వత్సా! నే నొక సిద్ధుఁడను. నీ రోదనము నాలించి, జాలిఁదూలి, నా మంత్రప్రభావముచే నిన్నిటకుం గొనివచ్చితి.

మంత్రికు :— మీరుకూడ నన్నామాయలాడివలె బంధించెదరా? అమ్మో! ఇచ్చట నున్నవా రందఱు మాంత్రికులే గాఁబోలు?

యోగి :— భయములేదు నాయనా! నీ కష్టము లింకఁ దొలఁగినవి. ఇటుపై నీకు శుభమగుగాక!

మంత్రికు :— మహాత్మా! నమస్కారము. అనవసరముగ మిమ్ము శంకించి నిందించఁబోయితిని. క్షమింపుఁడు. (కత్తి యొరలో బెట్టి, సాష్టాంగముగా పడును.)

యోగి :—(లేవనెత్తి) నాయనా! కూర్చొనుము. నీ వీ యరణ్యమార్గమునఁబడి యెందు పోవుచున్నావు?

మంత్రికు :— యోగీంద్రా! కుంతలదేశము పోవ నిశ్చయించి యిట్లు బయలుదేరితిని. కర్మానుభవమున నీ కష్టములు పడవలసి వచ్చినది — మహాత్మా! మీ రాకచే చరితార్థుండ నైతిని.

యోగి :— పాపం! కాల మొక్కరీతిగా గడువదు నాయనా! "కష్టసుఖములు కావడికుండలు", సహించినవాఁడే ధన్యాత్ముఁడు. నీ రూపుచూడ రాజలక్షణములతో నొప్పుచుంటివి. నీ దే దేశము?

మంత్రికు :— ఆరా! మాది మనుజపురము.

యోగి :— ఏమీ! మీఁది మనుజపురమా! రాజు నీ కేమవ నున్నాఁడు?

మంత్రికు :— అతఁడు రాజవంశమువాఁడు. నేను బ్రాహ్మణ కులజుఁడను.

యోగి :— అట్లయిన మీ రాజుకు సంతతి గలదా?

మంత్రికు :— ఒక కుమారుఁ డుగలడు. వారికి మీకుగల పరిచయ మేమి?

యోగి :— (కొంచె మూరకుండి) ఆ రాజోత్తముఁడు సంతానములేక పెక్కేండ్లు దుఃఖార్తుఁడై యుండి చివరకు నా మంత్రమహిమచే సంతానవంతుఁ డయ్యెను.

మంత్రికు :—(పట్టరాని సంతోషముతో) యోగీంద్రా! అయితే వారు మీ రేనన్నమాట. (మరల నమస్కరించును.)

యోగి :— కళ్యాణ ప్రాప్తిరస్తు.

మంత్రికు :— మహాత్మా! కళ్యాణ మెట్లగును. ప్రయత్నించుకొలఁది క్రిందికి దిగజారుచుంటిని గదా!

యోగి :— శీఘ్రకాలములో పెండ్లికుమారుఁడవు కాఁగలవు. నీ యభీష్టము నెఱవేరును. నీ యుద్యమములు సంతసమొందెడును.

మంత్రికు :— యోగీంద్రా! మీయొక్క మంత్రశక్తి చేతనే నేను గూడ జనించితినఁట. మంత్రపానీయమును పీడెములో నిడి యివ్వగా మా యమ్మ తిన్నదఁట! తత్ఫలితముగా నేను పుట్టితినని మా యమ్మ చెప్పఁగా వింటిని.

డనుభవించుచున్నట్లు, మిక్కిలి యానందించుచు, స్వాంతమునం దేవే వియో వెత్తి యుహోహాలలను గొనుచుండ, నిట్లు తలపోయసాగెను. "అమ్మయ్య! బ్రహ్మరాక్షసి బాధ వదలిపోయినది. హా! ప్రేయసీ! దేశయాత్ర చేసెదనని సులభముగా పల్కితివి. ఎన్ని కష్టములు పడితినో నీ కేమి తెలియును. ఇప్పటి కేదియో యొక దారికి వచ్చితిని. వచ్చితి నని యేమి నిశ్చయము. భవితవ్య మింకెట్లు మారునో? ఇంక నెన్నిపాట్లు పడవలసియున్నదో? ఆ యోగీంద్రుఁడు నా పాలి దైవమైనాఁడు. లేకున్న యీపాటి కా బ్రహ్మరాక్షసి నోటిలోఁ బడియుందునుగదా!" అని తల పోయుచుండఁగనే పాపమా యువకుఁ డొడలెరుఁగని నిద్రకు లోనయ్యెను. రత్నపుమూఁటల నొకవైపున బారవైచి, యా రాత్రి సత్రమునం దా మంత్రి కుమారుఁడు నిశ్చింతగా నిద్రించె ననుటలో నతిశయోక్తి యేమున్నది?

మంత్రికుమారునికి సాయముగా వచ్చిన భటులిర్వురును సురక్షిత ముగా తిరిగి మనుజపురము చేరుకొనిరి. వారలకు మంత్రికుమారుని జాడ లేమియుఁ గన్పట్టకపోవుటచే నాతఁడు మరణించియుండు నని భావించు కొనిరి. వారు మంత్రిదగ్గఱ కేగి బిక్కమొగములువైచి చూచుచు నిలు చుండిరి. ఏమి చెప్పుటకు వారికి నోరాడకుండెను. వారి చూపులలోని భావ మర్థగతము చేసికొని, శంకాకులచిత్తుండై సత్యకీర్తియు తత్తఱ పాటున నా భటులను పదేపదే ప్రశ్నించసాగెను. చెప్పకతప్పని యంశ మగుటచే, నెట్లో గ్రుక్కలుమ్రింగుకొనుచు, వార లిట్లు విన్నవించుకొనిరి.

"బాబూ! చెప్పుటకు నోరాడకున్నది. అయిన నిట్టి విచారకర మైన వార్త మీ ముందు నుడువుటకు మాబోటి కృతఘ్నులము ధైర్య మవలంబింపక తప్పదుగదా! మీ కుమారునికి సహాయులమై పోయి రెండు దినములు ప్రయాణము సాగించిన మరుచటి రోజున యొక గాఢ మైన యరణ్యమునం జిక్కితిమి. పోవుటకు మార్గమున్నను, కుతపకాల

మగుటచే పోనోపక, యచ్చటనేయున్న యొక వటవృక్షముక్రింద బసచేసి వలయు పదార్థములు వండుకొని భుజించితిమి. ఇంచుక విశ్రమించి మరల నేఁగుసరికి, పెనుగాలి యొకటి చుట్టుముట్టి మా ముగ్వురను దూరదూరముగా విసరివైచినది. అనంతరము కొంతతడవునకు గాలి యణఁగినంతనే కుంభవృష్టిగ వర్షము గురియసాగినది. ఎచ్చట జూచినను నీటిమయమే. పెనుగాలికి పడిన మహావృక్షములకు, చచ్చిన జంతుకోటికి మేరలేకుండెను. సెలయేరు లన్నియుఁ గలసి మహానదివలె యుప్పొంగి, పడిన వృక్షములతో నరణ్యమునందున్న మరికొన్ని చెట్లను పెల్లగిల్లఁజేసి, త్రోసికొనుచు ప్రవహింపఁజొచ్చెను. మే మిరువురమును కొంతవడికి కలసినవారమై, యొక బలిష్ఠమైన చెట్టును వెదకి, తద్వృక్షారోహణము గావించితిమి. మా యదృష్టవశమున నా చెట్టు మాత్రము ప్రవాహబలమునకు గురికాకుండెను. అందుపైనుండి, చిరంజీవి జాడకై యెడలెల్ల కన్నులు జేసికొని చూడ నారంభించితిమి. కొంతసేపటికి కాతఁడా ప్రవాహములోనుండి కొట్టుకొని పోవుచుండుట గాంచి, నిర్విణ్ణులమైతిమి. మేము చూచుచున్నంతవఱ కతఁడు తీరము చేరుకొన్నట్లులేదు. ప్రవాహభరమున కోడి చెట్టు దిగుటకు సాహసించలేకపోయితిమి. మూఁడుగంటల కావల కొంత నీటి యొత్తిడి తగ్గినది. దిగి పరిసరప్రాంతములెల్ల గాలించితిమి. లాభము లేకపోయినది. చివరి కాతనికై వగచుచు, చేయునదిలేక తిరిగి వచ్చితిమి. క్షమింపు" డని యేతద్వృత్తాంత మంతయు విన్నవించి పోయిరి. విన్నదే తడవుగా మంత్రియు నేలఁబడి మూర్ఛిల్లి కొంతవడికి తెల్విఁగాంచి, దుఃఖభారమున కోపక, వారు చెప్పిన యుదంతమునుబట్టి నిజముగ తన కుమారుఁ డీ యిహలోకము వీడిపోయి యుండుననని, పొంగి పొరలెడు దుఃఖమున నేలపై మేనుమఱచి దొర్లుచు, దైవకృత మట్లుండెగదా యని మతిమంతుండగుటచే, కొంతవడికి విచార ముపశమింపఁజేసికొని, యిట్లనుకొనసాగెను. "హా! విధీ! లేకలేక నీవే ప్రసాదించిన యా

యొక్క కుమారుని మరల నీవే పొట్టను పెట్టుకొంటివా ? పరమయోగీంద్రుని వరప్రసాదమున చిరకాలమునకు పుత్త్రవంతుండనైతిని. అల్లారుముద్దుగ నాచిన్నిచిలుకను పెంచుకొంటిని. నా యర్థము ప్రాణ మాతఁడే యని యుంటిని. అతనియందుగల ప్రేమచేతనే, వాని మాటకు మారాడక, పంపలేక పంపలేక, దేశయాత్రకు బంపితిని. హా! దైవమా! ఆ చిన్నిపాపనియెడల కరుణ లేకపోయెనా ? యోగీంద్రా! ఎచ్చట నుంటివో ? నీవైన నీ వరప్రసాదుని రక్షింపలేవైతివా ? హా! తనయా! నీ కీ తీర్థయాత్ర యేడవచ్చెను తండ్రీ! నేను వలదన్నను మానవైతివి. నీయందలి వాత్సల్యమున నీమాట కాదనలేకపోయితిని. నీ యభిమత మీడేర్చినందులకు నాకీ గర్భశోకము తెచ్చిపెట్టితివా ? మీ యమ్మకీ వార్త నెట్లు చెప్పుదును. చెప్పి యామె నెట్లోదార్తును. చిరంజీవికి కుశలమా ? యని ప్రభువు లడిగిన నేమి ప్రత్యుత్తర మిచ్చెదను. నీ యీ తీర్థయాత్రసంగతింకను ప్రభువులదరి విన్నవింపలేదు. ఇంతలోనే యాశ్వాసాంతమా ? చింతాకులచిత్తుండనై యీ రాజ్యకార్యము లెట్లు నిర్వహింపఁగలను." యని పరిపరివిధముల చింతించుచు నెట్టకేలకు ధైర్యమవలంబించినవాఁడై, తన బుద్ధివిశేషముచేత నాలోచించి "యోగీంద్రుని వరప్రసాదమున జన్మించిన తన కుమారుఁడు మరణించుట యసంభవ మనియు, అదిగాక నాతఁడు మిక్కిలి ధైర్యవంతుఁడును, నేర్పరియు గాన, తీరము చేరుకొని, సురక్షితముగా నుండియుండుననని, దృఢనిశ్చయము చేసుకొనెను. భార్య కీ వృత్తాంతము తెలియనీయక యతఁడు మునుపటి వలెనే నగుమోముతో ప్రవర్తించుచు రాజ్యకార్యములు గూడ నిర్వర్తించుచుండెను.

రాజు, మాత్రము మంత్రిముఖము విన్నఁబోయియుండుట, మునుపటివలె ధీరోదాత్తమగు కళ యగుపింపకుండుటయు పరికించి యనుమానముచే నుండఁబట్టక యాతని మాటిమాటికి గ్రుచ్చి యడిగి, జరిగిన

వృత్తాంతమును తెలిసికొనెను. తెలిసికొని యా రాజోత్తంసుఁడును మిక్కిలి విచారమంది యేమియుఁ దోఁపక యంతిపురమున కరిగెను. తనకు పుత్రసంతానము లేకుండుటచే మంత్రికుమారుని స్వీయాపత్యముగ నల్లారుముద్దుగఁ జూచుచు మనుజపురాధీశ్వరుఁడు కాల మీడ్చుచుండెను. నేఁ డా చిన్నికుమారుని ప్రమాదస్థితిని వినినప్పటినుండి పాప మా రాజేంద్రుఁడు మొదలు నఱికిన తరువువలె క్షణక్షణమునకు స్మృహతప్పి నేలఁగూలుచుండెను. ఆహార నిద్రలయందు నాతఁడు తొల్లిఁటివలె సంచరింపలేదు. రాజ్యకార్యములన నాతనికి తలనొప్పి యావహిల్లుచుండెను. చివరి కతఁడును గొంత ధైర్యమవలంబించి నలుపుర భటులను రప్పించి మంత్రికుమారుని వెదుక నాజ్ఞాపించి పంపించెను. వారును ప్రభువాజ్ఞ ప్రకారము దివసత్రయము పల్లెలను, అడవులను వీలై నంతమట్టుకు శోధించిరి. కాని మంత్రికుమారుని జాడలేమియును గానరాకుండుటచే తిరిగి వచ్చి దుఃఖితులై రాజునొద్ద నిలుచుండిరి. "సరే! కానిం"డని కరుణాకరుఁ డా భటులను పంపివేసి నిజమందిరమున కరిగెను. 'ఆహా! ఎంత దయాస్వభావి. కరుణాకరుఁడను నామ మతనికే చెల్లును.' కన్నతండ్రివలె నా రాజేంద్రుఁడు దుఃఖించుట గాంచి మంత్రి నివ్వెఱవోవుచుండెను. "ఆహా! ఎంత దారుణము! నిజముగ నా చిరంజీవి మరణింపలేదే! చనిపోయె ననుట కంతప్రమాదస్థితి కాదే! తగిన నిరూపణ శూన్యము. భటులు చెప్పిన మాటలు పాటించి, భవితవ్య మించుకైన నూహింపక, కేవల మాతఁడు మరణించెనని విచారించుట నీతి విరుద్ధముకాదా? ధీరుల లక్షణమా? కాదు — వారి పుత్త్రీవాత్సల్యము, సంకుచితమనోధీరత్వము వారి నా స్థితికిఁ దెచ్చినది. దేశదేశము లింతకును గాలించి వెదుకనైన లేదుగదా? ఔరా! బుద్ధిమతీ! బ్రతికియుండిన నీకై యెంత దుఃఖించుచున్నారో? యెఱుఁగుదువా? నిజమే! నీ వెట్లు తెలిసికొందువు? నీకే తలంపే లేదు. నీవుమాత్రము సుఖముగ నొకచోటనుంటివా?"

"విజయకుమారీ! నీ కింకను ప్రియుని సంగతి తెలియదుగదా! తెలిసిన నీ వెంత వనట బొందెడిదానవో? నీకై కాదా యాతఁ డిన్ని కష్టములు పడుచుండెను. చివరికి నీ యాశ నెఱవేర్చునో, నెఱవేర్చఁడో కదా! సరే కానిమ్ము. ఉభయులు దైవమునే నమ్మినారు."

రానురాను చెలికత్తెలు మంత్రినందనుని సంగతి విజయకుమారి చెవులఁ బడవేసిరి. ఆ మాట విన్నదే తడవుగా నామె నడుము విఱిగిన నాగుచందంబున శయ్యపై నుండి లేవలేకపోయెను. తత్క్షణమే యామె మూర్ఛిల్లెను. మూర్ఛలో మునిగిన యామెకు చెలికత్తె లుపచారములు చేసి సేదదీర్చిరి. ఆమె నోట 'ప్రియా' యనుమాట తప్ప యన్యము లేదు. ఏమి కర్తవ్యమో? యటుపైని, రాజకుమారికి తోఁచలేదు. ఆమె పురుషులలో, మగవానివలె మెలంగెడి దగుటచే పిఱికిగుండెగలది కాదు. కార్యముపట్ల నామెకు పట్టుదలయు, ధైర్యము మెండు. వెంటనే చెలికత్తెల నావలకుఁ బంపివేసి, హృదయాందోళన మడంచుకొని, యామె దీర్ఘాలోచన తత్పరయై తత్శయ్యపైనే పరుండియుండెను. కాని యొక్క యుపాయముగూడ నామె యూహకు రాలేదు. ఎట్లు వచ్చును? దైవమప్పుడే ప్రతికూలించుచున్నది. కర్మానుభవమంతయు ముందున్నది. నాఁడన్నియు నశుభములే యామెకంటికి గన్పట్టుచుండెను. మంత్రికుమారుని యందుగల మోహ మామెకు ప్రతిబంధకముగా నుండెను. అతని జూడవలె నని రాత్రింబవళ్ళామె యువ్విళ్ళూరుచుండెను. రెక్కలు గట్టుకొనియైన కుంతలదేశమున కెగిరిపోవలెనని యామె రోజురోజుకు తుందుడుకందుచుండెను. మంత్రికుమారుని జూచువరకామెకు ప్రతిదినగండముగా నుండెను. పాపము! ఆ చిన్నవాఁడు తప్పక కార్యము నెఱవేర్చును. తన్ను రహస్యముగా వివాహమాడును. వివాహానంతరము తండ్రి గుర్తెఱింగినను, యాగ్రహింపఁడను నామె యూహలన్నియు, నిశ్చయములన్నియు, యాశయములన్నియు, నీటిలో నీడలట్లు ఆమెకు గన్పట్టుచు,

హృదయమును గలంచుచుండెను. ఆమెకు బ్రతుకే భారమై దోఁచెను. ఏమిచేయఁగలదు? రాజ్యము వీడి బయలుపడుట దుర్ఘటము. బయలు పడినను నొక్క స్త్రీహృదయము ఏమిచేయఁగలదు? పౌరుషమున్న పట్టుదల యుండవలెను. పట్టుదలయున్న ప్రయత్న ముండవలెను. ప్రయత్నించుటకు కొద్దియో? గొప్పయో? పరివార ముండవలెను. కుంతల దేశము చేరవలె నని యామె యుద్దేశము. మంత్రికుమారుఁడు పోయిన దగ్గఱనుంచి యామెకు వార్తలేమియును లేవు. అతఁడు కుంతలదేశము చేరినదీ లేనిదీ యామెకు దెలియదు.

రానురాను వివాహము చేసికొనుట ప్రతిబంధకమైనది. మనుజ పురాధీశ్వరునకు చక్కని కూతురు గలదని దేశదేశములవెంట ప్రాకి పోయినది. యువరాజు లందఱు 'నామె నెలాగైన వివాహమాడవలయు' ననెడి పట్టుదల వహించుచుండిరి. అందులో విక్రముఁడను రాజుమాత్రము మిక్కిలి పట్టుదల గలిగియుండెను. అతఁడు విజయకుమారిని తప్పక వివాహ మాడవలె నను తలంపుతో కరుణాకరున కొక లేఖ పంపెను. కరుణాకరుఁడును కుమార్తె యభిప్రాయ మరయుచుండెను. ఎంత చెప్పి నను కుమార్తె యంగీకరింపకునికి కరుణాకరుఁ డేమియు చేయనేరక మిన్న కుండెను. రానురాను విక్రముని పట్టుదల, ప్రయత్నము, ప్రబలమగుచుం డెను. అతఁడు తొందఱపాటు స్వభావములేని వాఁడగుటచే కరుణాకరుని జాబుల మూలముగనే యొప్పింపఁ జూచుచుండెను. లేకలేక కలిగిన యొక్క కుమార్తెను బలవంతపెట్టలేక కరుణాకర మహారాజందఱి యాహ్వానములను నిరాకరించుచుండెను. తన్మూలముగ సామంతు లందఱికి విరోధి కాఁజొచ్చెను.

దినమొక యుగముగా గడుపుచు ప్రియుని గలసికొనుట యెట్లను చు విజయకుమారి యధికాలోచనలతో నా గదియందే కారాగృహ బంధీకృతవలె కాలక్షేపము చేయుచుండెను.

ఆహా! దినము లెంత దారుణమైనవి. సుఖమున్నచోటనే దుఃఖము ప్రవేశించును. మంచియున్నచోటనే చెడుగు, నీతియున్న తావుననే యవినీతికి స్థాన మేర్పడును. చక్రములోని యాకులవలె నివి యన్నియు నొకదాని వెంబడి నొకటి వచ్చుచుఁ బోవుచునే యుండును. ఆహా! కాలచక్ర మెంత విచిత్రమైనది. ఒక్క రాకుమార్తెకై యెందఱి మనము లుప్పొంగుచున్నవో? చక్కగ వికసించిన పరిమళపుష్పమును గోరనివారుందురా?

## 4 తారుమారు:

మరునాఁడుదయ మరుణోదయమునకు పూర్వమే మంత్రికుమారుఁడు మేల్కాంచి, ప్రాతఃకృత్యము లన్నియు నెఱవేర్చుకొని, సత్రమునందు తా నద్దెకుఁగొన్న యా చిన్నగదిలోఁ గూర్చొని, రాత్రి తాను గాంచిన మధురస్వప్న మూహానుఁదోఁపఁగా పరమానందమందుచు, మాటిమాటికి, మోహావేశమున, విజయకుమారి యింకను తనముందుఁ గూర్చొని ప్రేమకలాపము చేయుచున్నట్లు భావించుకొనుచు, పరులు విందురన్న జంకావంతయులేక, "విజయా! ఏదీ! మరొకసారి దగ్గఱకు రమ్ము. నవ్వినవరత్నము లొలుకు నీ చిరునవ్వు మరియొకమారు నాపైఁ బ్రసరింపుము. కుంతలదేశమునుండి యెన్నాళ్ళకు వచ్చెదనో? నీ ప్రేమాస్పదమైన ముద్దొకటిమ్ము. మరల మనము గలుసుకొనులోపున, విజయా! మనము మానక స్వప్నమందైన గలుసుకొనవలయుఁ జుమా! నీవే కలఁ గాంచి నన్ను కలుసుకొనెదవో? నేనే కలఁగాంచి నిన్ను కలుసుకొందునో? నిర్ణయాతీతము. అది మన భావోద్రేకములో నున్నది. ఇంతకు ఆ కలలోని కలయూపు భగవన్నిర్ణయము. నిర్ణయించినదేగదా, మనకానందము. చూడు విజయా! ఇంక నేఁ బోయివచ్చెదనా?" అని చాప మా యువకుఁడు తా నింకను విజయకుమారి వద్దనే యున్నట్లును, కుంతలదేశ

మింకను పోనున్నట్లును, తలంచుచుండెను. భోజనము మాట యతనికి జ్ఞప్తిలేదు. అప్పటికే మధ్యాహ్నము కాఁజొచ్చెను. ఇంతలో నేదియో కలకలము వీధినుండి వినవచ్చెను. సత్రములోనివా రందఱు పోయి యా కోలాహల మేమిటో యరయుచుండిరి. అప్పటికిని మంత్రికుమారుఁడు స్వప్నదృశ్యవృత్తాంతమును మఱచి కర్తవ్యాంశమునకు రాలేదు. ఇంతలో "రత్నపుదొంగ! రత్నపుదొంగ!" పట్టుకొండను కేకలు చటుక్కున యతని చెవులఁబడెను. వెంటనే యతఁడులికిపడి, తెలివి తెచ్చుకొని లేచెను. తన రత్నపురాసులన్నియుఁ గూర్చివోసిన సంచు లున్నవియో? లేవో? యని మిక్కిలి యాతృతతోఁ జూచుకొనెను. ఉండ కేమాను? పోఁగొట్టుకున్నవే మరల సంపాదించినవాఁడే? మరల గోల్పోవునా? కాదు, కాదు — తా నా రత్నపుమూటలపై యెంత యజాగ్రత చూపినాఁడు. పోయినరాత్రి —— పోయినను పోవచ్చుఁగదా! ఇంతకు నాతని యెడల దైవ మనుకూలమైయున్నాఁడు. భద్రముగనున్నవానికే దొంగల రాపిడి. అవియే దొంగిలింపఁబడుచుండును. నాఁటిరాత్రి మంత్రికుమారుఁడు తన ధనపుమూటల నొకవైపున బారవైచి నిద్రించెను. ఎందఱో చూచిరి. కాని యొక్కరికిని యనుమానము కలుగలేదు. అతని సొత్తునకు పూచిపుల్ల నష్టము కలుగలేదు. బుద్ధిమతి మిక్కిలి సంతోషించెనే గాని, రాత్రి తన అజాగ్రత్తకు తన్నుదా నిందించుకొనఁ జొచ్చెను. రత్నములే పోయిన తన ప్రయత్నమంతయు బూడిదలో గలిపిన పన్నీరగును గదా!

"యువరాణీగారి యంతఃపురములో దొంగతనము జరిగినది. నగలు, రత్నపురాసులు పోయినవి, దొంగ దొరకలేదు." అని యంతలో నొక పెద్దమనిషి గట్టిగ నఱచుచు సత్రములోఁ బ్రవేశించెను. పదిమంది యాతని దగ్గఱజేరి జరిగిన సంగతి తెలిసికొన నారంభించిరి. ఆ మాట విన్నదే తడవుగా మంత్రికుమారున కొడలెల్లఁ జెమట క్రమ్మజొచ్చెను.

ఏమగునో ? తనవద్దఁగూడ రత్నపుమూఁట లున్నవి. అతని కేమియుఁ దోఁపక కొంతవడి భయాందోళనచిత్తుఁడై నిలిచెను. "నీవెందు కట్లు నిలుచుంటివి ? యెవ్వఁడ" వని యొక్కఁడు నతని ప్రశ్నించలేదు. క్రమముగాఁ గొంతసేపున కెచ్చటివా రక్కడ మాయమైనట్లు తమతమ బసలలోనికిఁ బోయిరి. తా నా సత్రమునందున్న రెండు రోజులకు జెల్లింపవలసిన సుంకము యజమానికిఁ జెల్లించి బుద్ధిమతి చల్లగ బయటపడెను. "అమ్మయ్యా! ఇదియుఁ గొంత సుకృతమే! లేనిచో, నా దుండగీడులు నన్ననుమానించి, పసిపట్టి యప్పచెప్పిన చేయునదేమి ? నిదర్శనముగ రత్నపురాసులున్నవే ?" అని యనుకొని యాతఁడు మెల్లగ వీధి వీధి గమించి, యంగడి వీధిలోఁ బడెను. ఏమి లాభము ? తన రత్నములను గొనువా రెవరు ? అవి విక్రయించి ధనముగైకొని, సేవకులను నియమించి, పనివారలఁ జేకూర్చి చక్కని సౌధ మొకటి నిర్మించి, యందుండి కార్యసాధనము చేయనగునని గదా ! యాతని తలంపు. ఆహా ! యీ తలంపు తలవంపు ఘటిల్లజేయునేమో పాపము. బ్రాహ్మణహృదయము, దానికి తో డమాయికత్వము —— ఎట్లు జరుగును. హా విధీ ! ఏమీ ! నీ సంఘటన —— ఎందు కిట్లు వారిరువురికి అనురాగము గలిగించి బాధించుచుంటివి. సాయంతనము వరకా యువకుఁడట్లే యంగడులన్నియుఁ బరిక్షించుచుఁ దిరిగెను. కాని రత్నములు కొందుమని యెక్కఁడనలేదు. ఎవరిని కొనమనును ? తనవద్ద రత్నములున్నవని తెలుస్తే, నిముషములో నా సంగతి కోటలోనికి ప్రాకఁగలదు. ఆ కారణముచే నతఁ డెవ్వరిని యడుగక యట్లే ప్రతిదినము, దుకాణములన్నియుఁ దిరుగనారంభించెను. క్రమముగా వారము దినములు దొర్లిపోయినవి. మంత్రికుమారుఁ డొక క్రొత్త సత్రమునందు బసచేసి యుండెను. తన వద్దనున్న పై ధనముతో నాతఁడు దినవెచ్చము దీర్చుచుండెను. ఎనిమిదవ దినముదయముననే స్వీయ కృత్యములు నెఱవేర్చుకొని, వండుకొని భుజించి, యాతఁడు రత్నపు

మూటలు గైకొని, గుమ్మము దిగెను. ఆహా! ఏమి శకునము? "నూనె-కావాలా? బాబూ!" యని తెలుకుల దెదురు — చటుక్కున పాపమా యువకుఁడు నడుమువిరిగిన నాగువలె నేలఁ జతికిలఁబడెను. మరల నదియే పిలుపు — "ఛీ! పో! నూనె యక్కఱలేదు — గీనె యక్కఱలేదు"— మంచిజవాబే బాబూ! యని క్షణములో నా తెలుకలది ప్రక్కసందు తిరిగెను. మంత్రికుమారుని హృదయాందోళనమునకు మేరలేదు — అతని మనమంతయు శంకాకులమయ్యెను. వెనుకంజవేయుట మాని యాతఁడు గబగబ వీధిలోఁబడి పోవుచుండెను. ఏమి సంకల్పమో? ఏమి మాయయో! వారము దినములు గాలించినను యంగళ్ళలో రత్నములుకొను చోఁటు లేదు. అలవాటు ప్రకార మానాఁడాతఁడు మొదటి యంగడి పరికించి, సందు తిరిగినతోడనే "కండ్లు జిగేలుమనెను," తల గిర్రున తిరుగఁజొచ్చెను. హృదయమునందు తత్తఱపాటు ఆవహిల్లెను — "తగిన వెలకు రత్నములు మొ॥నవి కొనబడును." అని వ్రాసియున్న బల్ల నాతఁడు తిలకించెను. తొందఱ తొందఱగా పదేపదే యతఁడా లిఖితమును జదువుకొని, మనోహరముగానున్న యా కొట్టులోనికి, వ్యాకులచిత్తముతోడనే ప్రవేశించెను. "దయచేయుఁడు — దయచేయుఁడని" ప్రవేశించుట తోడనే యొకసేవకుఁ డెదురై లోనికిఁ దీసికొనిపోయెను. ఒక యున్నతాసనముపై మంత్రికుమారుని గూర్చుండఁజేసి, యా సేవకుఁడు లోపలి గదిలోనికిఁ బోయెను. క్షణములో నొక పెద్దమనిషి వచ్చి "సలామని" దొంతరగఁ బరచిన పరుపులగద్దెపై నెక్కి గూర్చుండెను. ఆహా! ఏమి స్వరూపము. ఆరడుగుల దీర్ఘశరీరము, ఎఱ్ఱని తొగటుదారమువంటి దేహచ్ఛాయ, స్వతస్సిద్ధముగ దృఢకాయుఁడు, కోరమీసములు — చెప్పరాని యందము చెప్పనలవికాదు — గౌరవనీయునివలె యాతఁడొకింతసేపు మంత్రికుమారుని సంప్రతించి, తదుపరి యిట్లు ప్రశ్నించనారంభించెను.

అతడు : — అయ్యా! మీ రేమి విక్రయింపఁదలఁచుచున్నారు?

మం॥కు :— సల్పమేమియుగాదు — అందుచే తిరిగి తిరిగి యిక్కడకు వచ్చితిని.

అతడు :— అవును — అయినచో రత్నములే విక్రయించెదరా ?

మం॥కు :— ఇక్కడ కొనున వవియేగదా !

అతఁడు :— బంగారమునకు పైనేదియైనఁ గొందుము — ఇంతకు మీరేమి విక్రయించెదరో తెలుపరేమి ?

మం॥కు :— తెలుపుట కేమున్నది ? నావద్ద రత్నములే యెక్కువగ నున్నవి. వజ్రములుగూడ కొద్దిగఁ గలవు.

అతఁడు :— చాల సంతోషము—ఇవి మీరు సంపాదించినవేనా?

మం॥కు :— కాదు — మా పూర్వులు సంపాదించిపెట్టినవి. మా పూర్వులందఱమాత్యులై యింత కెక్కుడు ధనమార్జించిరి.

అతఁడు :— మంచిది — మీకు వీని నిప్పుడమ్మవలసిన యగత్యమేమి ?

మం॥కు :— మా నాన్నగారితో మా కాపదవు లంతరించినవి— ఉన్న యప్పులన్నియుఁ దీరినవెనుక, పదిసంవత్సరములు హాయిగా నేలోపము లేకుండ కాలము గడిపితిమి. శుభకార్యముల నిమిత్తము పెక్కుధనము వ్యయమైపోయినది. నేఁటికీ రత్నములుతప్ప, చిల్లర పైకమేమియు లేదు. ఎంతకాలము వీని నిట్లు విక్రయించక యుందుము. ఉండిన దినవెచ్చ మెట్లు గడచును ?

అతఁడు :— అవును — అట్లయిన మీ స్వస్థల మేది ?

మం॥కు :— మాది మనుజపురము. అచ్చటి కార్యము జరుగు నవకాశము లేక యిచ్చటికి వచ్చితిని.

అతఁడు :— మీ పేరు —

మం॥కు :—(కొంచె మూరకుండి, వినని వానివలె) — ఆ! ఏమి టడిగారూ ?

అతఁడు :— పాపం! పరాకుగా నున్నట్లున్నది — మీ పే రేమని యడిగితిని —

మం॥కు :— (సంశయించి) నా పేరు 'మతిమంతుఁ' డంటారు.

అతఁడు :— చాల చక్కనిపేరు — మీ రీ యూరు వచ్చి యెన్ని దినములయినది ?

మం॥కు :— పదునొండు దినములు గతించినవి.

అతఁడు :— (ఆలోచన నభినయించి) బస యెచ్చట ?

మం॥కు :— స్థిరముగు బస యనున దొకటిలేదు — వీలునుబట్టి మార్చికొనవలసి వచ్చుచున్నది —

అతఁడు :— ఓహో! అయిన, మీరిప్పు డమ్మవలసిన రత్నము లెన్నుండును.

మం॥కు :— సుమా రారుమానిక లుండవచ్చును. వజ్రములొక పావు గలవు.

అతఁడు :— చిత్తము. మంచిబేరము దెచ్చితిరి.

మం॥కు :— అయ్యో! భోజనసమయ మగుచున్నది. నేఁ బోవల యును. ఎట్లు కొందురో ? వేగిరము తెల్పి, నన్నంపుఁడు.

అతఁడు :— ఇంత తొందఱపడితే యెలా బాబూ! డబ్బుతో పనిగదా ?

మం॥కు :— కావచ్చు — నాకు తొందఱపనులున్న కతమున యట్లనవలసి వచ్చెను.

అతఁడు :— సరే! రత్నము లొక్కొక మానెడు నూరు వరహాలు చొప్పున కొనఁబడును. వజ్రపు లట్లే, ఇష్టమైనచో నిచ్చివేయుఁడు.

మం॥కు :— సరే! అలాగే గైకొనుఁడు. మీరు మాత్రము సిసలైన ధర చెప్పకుందురా?

అతఁడు :— తగినవెలయే చెప్పితిని. ఏదీ! మీ రత్నము, లవి, యిటిచ్చివేయుఁడు.

(మంత్రికుమారుఁ డిచ్చెను).

ఆ పెద్దమనిషి వానిని వేరువేరుగా తొలిపించి, సేవకునిచేతి కిచ్చి పంపివేయును.

మం॥కు :— అయ్యా! మాకు రావలసిన ధనమిచ్చి మమ్ము పంపివేయుఁడు.

అతఁడు :— ఆ పనియే విచారించుచున్నాను. తొందఱపడకుడు.

మరల నొక పావుగంట గడచినది. ఆ పెద్దమనిషి యిట్లనే గద్దె దిగక కూర్చుండి, వెగటుగ చిన్నవ్వు నవ్వుచుండెను. మాటిమాటికి మంత్రికుమారునివైపు చూచుచు, తన కోరమీసమును కుడిచేత దువ్వుచుండెను. మంత్రికుమారున కిదియంతయు నగమ్యముగ గన్పట్టుచుండెను. అతని కేమియు నర్థముకాలేదు. మనసులో నించుక భీతి గలుగఁజొచ్చెను. మరల నాతఁ డా పెద్దమనిషిని "ఆలస్యమగుచున్నది. నా సొమ్ము చెల్లించివేయుఁడు పోవలయు" నని సగౌరవముగా నడిగెను. "సేవకున కాజ్ఞాపించితిని. ఈపాటికి వచ్చుచుండును. ఆగుఁడని" యతఁడు జవాబు చెప్పెను. ఈ విధముగ నొక యరగంట గడచిపోయెను. మంత్రికుమారున కేమి మాట్లాడవలయునో, నెట్లు మాట్లాడవలయునో యర్థముకాలేదు. అతని మనసున కిది యేదియో వచ్చిమోసమువలె దోఁచుచుండెను. ఏమిచేయఁగలఁడు. రత్నములా మోసగాని కప్పఁజెప్పినాఁడు. శూన్యహస్తుఁడైనాఁడు. ఏమని యడుగఁగలఁడు. అతని గుండెలు దడదడ కొట్టుకొన నారంభించెను. కళ్లు గిరున తిరుగుచుండెను. దైవమునే నమ్ము

కొనుచు, ధ్యానించుకొనుచు, మరికొంత సేపతఁడట్లే మౌనము వహించి యుండి, యెదుటనున్న పెద్దమనిషితో నిట్లనెను.

మం॥కు :— అయ్యా! ఈ బేరము నాకేమియు నర్థముకాలేదు. ఇంత తడవాయె. నా ధనము నాకిచ్చి పంపివేయక ఏమిటా నిరీక్షణ?

అతఁడు :— తొందరపడకయ్యా! నీ పని పూర్తిచేయుదును.

మం॥కు :— పూర్తిచేయు టనునదుండినచో నింతసేపా? ఇంత పెద్దవర్తకులు చేత సొమ్ములేనిచో, నిట్టి బేరమునకై లిఖిత మేల వ్రాయించవలెను?

అతడు :— మా లిఖితముతో నీకు పనిలేదు. ఆ లిఖితము మొన్నటినుండియే వచ్చినది. ప్రస్తుతము నీ లలాటలిఖిత మెట్లుండునో? యాలోచించుకొమ్ము.

మం॥కు :— ఏమీ? రానురాను గౌరవముతప్పి మాట్లాడు చున్నారే!

అతడు :— ఆ గౌరవాగౌరవములు మాకు తెలియవు. కొంత సేపాఁగినచో చేయవలసిన గౌరవముచేసియే పంపించుదును.

మంత్రికుమారుఁడింకేమియు మాట్లాడలేదు. ఏమి జరుగునో చూతము. కానున్నది కాకమానదని, యతఁడట్లే క్రింది మోము చేసికొని కూర్చుండెను. ఏమున్నది? అయిదు నిముషములయినదో? లేదో? తలుపులు దభీమని మూయఁబడెను. గదియంతయు చీకటి. "అమ్మయ్యో! రాజభటులు! నలువురు కాలకింకరులువలె నున్నారు. హా! దైవమా! ఏమి చేయుదును. ఎందు జొత్తును?"

మంత్రికుమారుని చేతులు స్వాధీనములో లేవు. ఎక్కడికో పోవు చున్నట్లున్నది. కళ్లువిప్ప నశక్తుఁడగుచుండెను. పోవుచున్నది గుఱ్ఱపుబండి. టకటకటక మను గుఱ్ఱపుడెక్కల చప్పుడు గట్టిగా వినబడుచుండెను.

వీధిలో కేకలు ! "రత్నపుదొంగ! దొరికెను. పట్టుబడిపోయెను. అదిగో! తీసికొని పోవుచున్నారు. పట్టినవారు గాణీగారి సేనాధిపతి." అహా! ఏమి విచిత్రము. ఏమి పంతము. ఏమి రాజధర్మము ? వెన్న రాసుకున్న మూతికా ముచ్చుదెబ్బ! రత్నపుదొంగ యేనాఁడో పారిపోయెను. నిరపరాధియైన మంత్రికుమారుఁడా ముచ్చు? రత్నములమ్మ ధనవంతులే లేరా? అమ్మినవారెల్ల దొంగలా? కపటపన్నాగము పన్ని యీ సేనాధిపతి యెంత గావించినాఁడు. హా! బుద్ధిమతీ! ఏమి నీ దురదృష్టము. దైవమున కింత విరోధివైనా వేల ? — ఇంతకు దైవనిర్ణయము నెవరు తప్పించగలరు ?

అంతయు నిశ్శబ్దముగానున్నది. విశాలమైన చావడి, మనోహరముగా నున్నది. ఉన్నతమైనపీఠము లై దారమర్చఁబడి యున్నవి. మంత్రికుమారుఁడు స్వేచ్ఛగనే నిలబడియుండెను. ప్రక్కన సైన్యాధిపతి యొక్కడు నుద్యోగదుస్తులతోనే నిలుచుండెను. మరి యెవ్వరును లేరు— మంత్రికుమారుఁ డట్టే వెఱ్ఱిచూపులు చూచుచు నిలుచుండెను. ఆ పీఠము లందొకదానిపై యెఱ్ఱని సంచులు మూఁడుండెను. ఏమి మాయ ? సంచులు మాత్రము మారిపోయినవి. రత్నములు మాత్రము పావ మా మంత్రినందనుఁడు తెచ్చుకొన్నవే. మంత్రికుమారున కిప్పుడంతయు నర్ధమైనది. ఎంతేని క్రోధ మాయత్తమగుచున్నది. ఏమిచేయఁగలఁడు ? తొందఱపడిన మరింత చిక్కులలో పడవలసివచ్చునేమో? తొందఱెందుకు పడవలెను ? జరుగవలసిన దేదియో జరిగిపోయినది. ఇంక నేమి జరిగినను జరుగఁగలదు. మనసును చిక్కబట్టి మంత్రికుమారుఁ డట్లే నిలుచుండెను. ఇప్పుడతని హృదయములో భీతి యణుమాత్రమును లేదు.

నాలుఁగు ఘడియల కాలమైనది. 'టంగ్' మని యొక గంట మ్రోగినది. అప్పటికే మధ్యాహ్నము మూఁడు గంటలు దాఁటియుండును. ఎన్నఁడెఱుగని యాఁకలిబాధ నానాఁడు మంత్రికుమారుఁడు పొందుచుం

డెను. దాహము మితిమీరి, నాలుక యెండిపోవుచుండెను. నీళ్ళకోస మెవరి నడుగును? ప్రక్కనున్న పెద్దమనిషి యీగంట వినినతోడనే లోపలికిఁబోయి, యిద్దఱు సేవకులతోఁ బ్రవేశించెను. ఏమి గౌరవము! రెండు వెండిపళ్ళెరములయందు తినుబడి పదార్థము లుంచి, చల్లని పానీయములతో సహా యతఁడు సేవకులచేత తెప్పించెను. సగౌరవముగా నతఁడు మంత్రికుమారు నాహ్వానించి, కూర్చుండబెట్టి, వీనిని యారగింపుఁడనెను. మంత్రినందనుఁ డేదియో నాలోచించుచుండెను. "మీరు ఏమియు సంశయము నందవలదు. నాకుఁగూడ నాఁకలిగ నున్నది. మీరు తిననిదే నేను తినను." అని యాతఁడు మరల మంత్రికుమారెనిపై ప్రేమవీక్షణములఁ బఱపుచు ననెను. "మీ గౌరవమున కెంతయుఁ గృతజ్ఞుఁడ"నని బుద్ధిమతి యానందముతో ఫలహారములు భుజించెను. ఆ గౌరవనీయుఁడును వీడెమందించి, "తా మిక్కడనే గూర్చుండుఁడు. నేనిప్పుడే రాఁగలను." అని లోపలికిఁ బోయెను. మంత్రికుమారుఁ డట్లే సంభ్రమాశ్చర్యచిత్తుఁడై పీఠమందు గూర్చుండి యుండెను. అతని మనసు పరిపరివిధములగు భావనలతోఁ గలఁగిపోవుచుండెను. "ఎవ్వరును లేరు — పారిపోయిన బాగుండును — ప్రాణములైన దక్కును. రత్నపుదొంగ యని నన్ను పట్టుకొనిరి. నా రత్నములను కాఁజేసికొనిరి. నన్నింక ఖైదు చేయకమానరు." అని మంత్రికుమారుఁడు తలంపఁజొచ్చెనే కాని, యాతనికి కార్యసాధనమగు మార్గము దోఁపలేదు. తనవద్ద నే ప్రభావము లేనివానివలెనే యుండెను. యోగీంద్రుఁ డిడిన మహాప్రభావముగల వనౌషధమున్నదే! చేతఁ బట్టి తలంచుకొన్నచోఁ దన్నుఁ బట్టువారెవరు? నిజమే! కాని యేమి లాభము? 'భార్గవశాపము ప్రబలముగ నున్నది. పనిచేయక మానునా?' అయ్యో! బుద్ధిమతీ! ఆ కర్ణుఁడు నీవు నొక్కటే! కానిమ్ము — నీ కిప్పుడంత యాపదెక్కడనుండి వచ్చును? వచ్చెనుపో! నీ సౌమ్యగుణము, నీ మన్మథాకారమే గెలుచుకొనఁ గలదు —

లోపలికిఁ బోయిన సేనాధిపతి కొంతసేపటికి తిరిగి వచ్చి "రత్నాపహరణ విషయమై రాణీగారు చర్చ చేయఁగలరు. తమరిక్కడనే యుండుట మంచిది." అని చెప్పి వెళ్లిపోయెను. అతఁడు వెళ్ళిన యొక్క ఘడియ లోపుగనే యువరాణీగా రిరువుర యంగరక్షకులతోఁ బ్రవేశించి, స్వీయ పీఠమందాసీన యయ్యెను. మంత్రికుమారుఁడు లేచి నిలుచుండి, ప్రత్యుత్థాన సూచకముగా శిరము వంచి నిలుచుండెను. ఇంతకన్న తలవంపేమున్నది? యువరాణీగారి వీక్షణము లా మంత్రిచిన్నవాని నిద్దపు మోమూరయఁ బ్రయత్నించుచుండెను. దించిన తలయెత్త కాతఁడట్లనే నిలుచుండెను. "తమరాపీఠమందుగూర్చుండు"డని మధురాతిమధురముగా నొక్కశబ్ద మా యువరాణీ వదనగహ్వరమునుండి వెలువడినది. మంత్రికుమారుఁ డొయ్యన పూర్వపీఠమం దాసీనుఁడయ్యెను. అంతలోనే "జయీభవ, విజయీభవ" యను నుచ్చైస్స్వరముతో నాశీర్వచనము పలుకుచు నా యువరాణీ మంత్రి ప్రవేశించెను. నమస్కారములు చేయుచామె యెదురేగి, మంత్రీశ్వరుని తోడ్తెచ్చి యుచితాసనాసీనుని జేసెను. తదుపరామె తన మంత్రియగు నా బ్రహ్మదత్తుని గాంచి యిట్లనియె.

యువరాణి :— అమాత్యవర్యా! న్యాయమూర్తులగు మీ ముందు నేఁడొక న్యాయవిచారణ జరుగవలసియున్నది —

మంత్రి :— చాల సంతోషము — ఏమది?

యువరాణి :— ఈ మధ్య మన యంతఃపురములో దొంగతనము పోయినది. తమకును విదితమే. రాజోద్యోగుల యజాగ్రతకు వారిని శిక్షించితిమి. ఆ గజదొంగ యెవరో? పట్టవలసినదని, సైన్యాధిపతి కాజ్ఞాపించితిని. అతఁడీయువకునిపై నేరారోపణచేసి పట్టి తెచ్చినాడు.

మంత్రి :— ఈతఁడే హర్తయని, యతఁ డెట్లు నిర్ధారించెను?

యువరాణి :— రత్నముల వర్తకునివలె యతఁడు నటించి, యంగడి వీధిలో యొక దుకాణము పెట్టియుండెనట. అంత నీ యువకుఁడు

రత్నము లమ్మొదనని వెళ్ళెనట. సరిగ మన యంతఃపురములో పోయిన ఆరుమానికల రత్నములనే యితఁడమ్మెను. దొంగతనముపోయిన నాఁటికీ యువకుఁ డీపట్టణములోనే యున్నట్లు, అతని ప్రసంగమువలన నిర్ధారణమయ్యెనఁట. అందుచే నితనిని పట్టి తెచ్చినాఁడు.

మంత్రి :— ఒక్కరత్నములనే యితఁడు విక్రయింపఁదెచ్చెనా ?

యువరాణి :— లేదు. వజ్రము లొకపావుగూడ యితనివద్ద గలవు. వానినిగూడ మనసైన్యాధిపతి పట్టుకొని వచ్చినాఁడు. ఇవిగో తిలకింపుఁడు.

మంత్రి :— (పరిశీలనతోఁ జూచి) అట్లయిన నగలమాట యేమి ?

యువరాణి :— నగలుమాత్ర మితఁడు తెచ్చియుండలేదు.

మంత్రి :— అట్లయిన యితఁడున్న బస యెచ్చట ? అచ్చటికిఁ బోయి యితని సామగ్రి పరిశీలింపవలయును.

యువరాణి :— అదియు జరిగినది. అతఁడు బసచేసియున్న సత్రమునకుఁ బోయి సైన్యాధిపతి స్వయముగాఁ బరిశోధించినాఁడు. అతని దుస్తులు వగైరా తప్పించి యన్యము దొరకలేదు.

మంత్రి :— ఆ దుస్తు లెక్కడ నున్నవి ?

యువరాణి :— సైన్యాధిపతి తనయింటివద్ద నున్నవని చెప్పెను. అవసరమైనచో సేవకులు తీసుకురాఁగలరు.

మంత్రి :— ఆ దుస్తులు పరిశీలింపవలెను. వేగరము తెప్పింపుఁడు.

(యువరాణి భటుల కాజ్ఞాపించును. భటులును చిత్తమని సైన్యాధిపతి గృహమునకుఁ బోవుదురు.)

యువరాణి :— జరిగిన విషయము దీనికి మించిలేదు. న్యాయాన్యాయములు తమరే విచారించవలెను.

మంత్రి :— అట్లయినచో నే ప్రయత్నింతును. నన్నీ యువకునితో మాట్లాడనిండు —

బుద్ధిమతి :— పొరపాటు — యువరాణీ ! మావంటివార లట్లే మాటలాడుచుందురు. 'అతివినయం ధూర్తలక్షణం' అని యిప్పుడేగదా మహామంత్రులు సెలవిచ్చిరి.

బ్రహ్మద :— (చిన్నగనవ్వి) యువరాణీ ! వింటివా యీ చిన్నవాని వాచా చాతురి. అసాధ్యునివలె నున్నాఁడు.

బుద్ధిమతి :—సాధ్యుఁడ గనుకనే చక్కఁగఁ బట్టుపడితిని. 'దొంగ' యను క్రొత్తపే రొకటి సంపాదింపఁగలిగితిని. ఇంక నొక్కటియే కొఱంత.

బ్రహ్మద :— ఏమది ?

బుద్ధి :— ఎన్నఁడెఱుఁగని శ్రీకృష్ణజన్మస్థానము.

బ్రహ్మద :— ఓహో ! అది యొక్కటి చూడవలెనని కోరికగ నున్నదిగాఁబోలు ?

బుద్ధి :— అవును. ఒక్కదైవమునకే పట్టుబడియుండు కతమున, ఆ కోరిక తీర్చుకొను నవకాశము లేకపోయినది.

యువరాణి :— అమాత్యవర్యా ! ఇతఁడు దోషియో ? నిర్దోషియో ? నిర్ధారించుట కర్తవ్యముగాని, యనవసరముగ మాటలతోడ నేమి ప్రయోజనము ?

బ్రహ్మద :— యువరాణీ ! ఇతడు చెప్పిన వృత్తాంతమునుబట్టి, యితనిలో దోషత్వమున్నట్లు కనుపట్టదు. అయినను వీని దుస్తులుగూడ పరికించి నిర్ధారణ చేయవలెను. సేనాధిపతినిగూడ రప్పించుట మంచిది. ఇతఁడు నిర్దోషి యని తేలుచో, కృత్రిమవ్యూహమున నితని బట్టితెచ్చి, నిందారోపణ చేసినందులకు, సైన్యాధిపతి నావల శిక్షించవలసియుండును.

యువరాణి :— అవును. తప్పక సైన్యాధిపతిని పిలువనంపవలయును. "దొంగకు బదులు దొరను పట్టితెచ్చినట్లు నిర్ధారింపఁబడుచో" నా కపటవ్యూహ సూత్రధారిని శిక్షించుట పాడివిరుద్ధముకాదు.

(పోయిన సేవకులు దుస్తులతోఁ బ్రవేశింతురు.)

బ్రహ్మద :— అదిగో ! సేవకులీతని దుస్తులఁగొనివచ్చుచున్నారు. పరికించెదను.

యువరాణి :— తక్షణమే పరికింపుఁడు. ఆనవాలు లేమైన నున్నచో విచారణచేసి, కర్తవ్యాంశము సాధింపవచ్చును.

బ్రహ్మదత్తుఁడు సేవకులు గొనివచ్చిన దుస్తులమూటను సమీపించి, మంత్రికుమారునివైపు జూచి యిట్లు ప్రశ్నించెను.

బ్రహ్మద :— అయ్యా ! ఈ దుస్తులమూఁట మీదై యుండునా ?

బుద్ధిమతి :— అవును. ఆ విధముగనే కట్టి, అంగడికి వచ్చునపుడు నా బసలో నట్టిపెట్టియుంటిని.

బ్రహ్మద :— అట్లయిన, దీన నేమేమి యున్నవో చెప్పఁగలవా ?

బుద్ధిమతి :— చెప్పుట కష్టసాధ్యము. లెక్కించక సేవకులు సిద్ధపఱచినవాని నెట్లు చెప్పగలను ?

బ్రహ్మద :— అట్లయిన నీ దుస్తు లెట్లుండునో చెప్పఁగలవా ? ఆనవాలు లేమైన నుండునా ?

బుద్ధిమతి :— దుస్తులలో నెక్కుడు పట్టుసంబంధమైయుండును. రత్నపుమూటలతోఁ గూడ నీ దుస్తులనుగూడ నాఁడు మర్కటములు గొనిపోయి, కొన్నింటిని పీకివేసినవి. గోరులతో కొంచెము కొంచెముగఁ జీరినట్లు కొన్నింటిపైఁ గన్పడును. పరీక్షింపుఁడు.

బ్రహ్మద :— ఇంతకుమించి మరేమైన చెప్పఁగలవా ?

బుద్ధిమతి :— చెప్పవలసిన దింకేమున్నది ? కొన్నింటిపై శ్రీకారము ఆనవాలుగ వేసియుంచినట్లు జ్ఞాపకముగలదు.

మంత్రియగు బ్రహ్మదత్తుఁడు దుస్తులమూఁట విప్పి క్రమముగ నన్నింటిని బరీక్షించును. అతనికి మంత్రికుమారుఁడు చెప్పినట్లే నిదర్శన

ములు గనుపట్టెను. కొన్ని పట్టుదుస్తులు మర్కటములచే నించుక పీకి వేయబడియును, చినిగియు నున్నవి. బుద్ధిమతి చెప్పిన వృత్తాంతము నతఁడు నమ్మఁగలిగెను. శ్రీకారము వ్రాసియున్న దుస్తుల నతఁడు పరీక్షించెను. విద్యాధికులైన ధనికవర్గమువారు వాడుటకుఁ దగినట్లున్నవి. రెండు మూఁడు మాత్రము కేవలము యువరాజులే యుపయోగింపఁ దగియున్నవి.

బ్రహ్మదత్తుఁడు బ్రహ్మానందపరవశుఁ డయ్యెను. అతఁడు యువరాణితో మంత్రికుమారుఁడు నిర్దోషి యని చెప్పి, "సగౌరవముగ నీతని సాగనంపుట మంచి"దని కూర్చుండెను. బుద్ధిమతి చాల నానందించుచు బ్రహ్మదత్తునితో నించుక పరిహాసముగా నిట్లనియెను.

బుద్ధిమతి :— మహామంత్రు లిచ్చుటనే పొరబడినట్లున్నారు. అంతఃపురములోఁ బ్రవేశించి రత్నములు దొంగిలించిన దొంగ, విలువైన దుస్తులుగూడ నెచ్చటైన దొంగిలించియుండ లేఁడా ?

యువరాణి :— అధికప్రసంగము చేయరాదు. మహామంత్రులు పూర్తిగ నాలోచించియే, మీయందుగల నిర్దోషిత్వమును వెల్లడించారు. తమరు తమ రత్నములను గ్రహించి, నాలుగైదు దినము లిచ్చట, మా సత్కారములంది వెళ్ళవలసినదని మా కోరిక.

బుద్ధిమతి :— చిత్తము, అట్లనే చేయుదును. మీవంటివారి ఆదరణ లభించినందులకు కృతార్థుఁడను.

యువరాణి :— మేము గూడ కృతార్థులమే ! (మంత్రివైపు జూచి) మహామంత్రీ ! ఈతనికి మన యాస్థానములోఁ దగిన యేర్పాట్లు గావింపుఁడు. ఈ వృత్తాంతము సైన్యాధిపతికి వాకృచ్చి, యతని వాఙ్మూలము గ్రహించి, మనయొక్క అజ్ఞ లేకుండ యతఁడీ కృత్రిమము గావించి, నిర్దోషిని, గౌరవనీయుని బట్టి తెచ్చినందులకు మూఁడు మాసములుద్యోగమునుండి తప్పింపుడు.

ప్రబ్మాద:— చిత్తము. చక్కగ సెలవిచ్చిరి. తమరింక యంతః పురప్రవేశము గావింపవచ్చును. నే నన్నియుఁ జూచుకొనెదను.

యువరాణి తత్క్షణమే లేచి యంతిపురములోఁ బ్రవేశించెను. బ్రహ్మదత్తుఁడు మంత్రినందనునికి తగిన బసయు, భోజనసదుపాయముల నేర్పాటు గావించి, ఇరువుర సేవకులను, పరిచర్యకై నియమించి, స్వీయ గృహమునకుఁ బోయెను.

మంత్రికుమారుఁడు భగవద్విలాసమున కచ్చెరువందుచు, విశాలమై, చూడఁ జక్కగనున్న యా గదిలోఁ బ్రవేశించి, స్నానము గావించి, కడుపార భుజించి పరుండియుండెను. తలుపులు దగ్గఱగఁజేర్చి, భటులిరువురును బయిట నిద్రించిరి. రాత్రి ఎనిమిదిగంటలు కాఁజొచ్చెను. మిక్కిలి బడలియున్నకతమున పాపమా యమాత్యాపత్య మట్లనే యొడలు మఱచి, గుఱ్ఱువెట్టుచు నిద్రించుచుండెను.

చదువరీ! ఇంకను మంత్రికుమారుని పరిస్థితి యెట్లు పరిణమించనున్నదో పరికింపుము. కుంతలదేశాధీశ్వరి యువరాణి పేరు వినియున్నావు గదా! 'వసుంధర.' ఆమె బుద్ధిమతి విషయమున నెట్లు మాట్లాడినదో గ్రహించితివా? తొలిచూపులలోనే యా యువతి బుద్ధిమతిని ప్రేమించెను. ఆ ప్రేమ యెట్లు పరిపక్వమగునో చూడుము. ఆమె యాశయము నెఱవేరునా? బుద్ధిమతి తాను విజయకుమారితోఁ జేసిన బాస తప్పునా? ముందు చదువుము.

ఆ రాత్రి యువరాణి పండుకొనుటకు ప్రయత్నించినదేగాని, యామెకు నిద్రపట్టలేదు. మాటి మాటికి బుద్ధిమతియొక్క రూపరేఖా విలాసములు, వాచా చాతుర్యము నామె హృదయమును కలవరపెట్టుచుండెను. క్షణక్షణమునకు బుద్ధిమతిపై ననురాగము వృద్ధియగుచుండెను. లేనిపోని యహోహలు, మధురభావము లామెలోఁ బ్రవేశించి, యామెను

నిలువున నిల్చి ప్రశ్నించుచుండెను. శరీరమంతయుఁ ద్రవాగ్నిచే గ్రాఁగి పోవుచుండెను. ఆమె యింతకోర్వలేక యా రాత్రి యెట్లైన మంత్రినందనుని గలిసికొనవలయునని నిశ్చయించెను.

రాత్రి పన్నెండు గంటలయినది. అంతయు నిశ్శబ్దము. కావలి వారును నిద్రఁదూఁగుచుండిరి. యువరాణి మెల్లగా లేచి తలచీర గైకొని మెల్లమెల్లగ నడుగులిడుచు మంత్రికుమారుఁడు నిద్రించుచున్న గదిలోఁ బ్రవేశించెను. మంత్రికుమారుఁ డొడలు తెలియని నిద్రావస్థలో నుండెను.

యువరాణికేమియుఁ బాలుపోలేదు. మెల్లగ రెండుసారులు మంత్రికుమారుని బిలిచినది. అతఁడు లేవలేదు. ఒత్తిగిల్లను లేదు. మరి యొకసాగి ప్రయత్నించి యించుక గట్టిగ బిలిచి చూచినది. ఉహూ! లాభములేదు. ఆమెకు సాహసము గలిగినదికాదు. కొంతతడవట్లే నిలుచున్నది. మంత్రికుమారుని ముగ్ధమోహనసౌందర్యము నామె చూచుచున్నకొలఁది మోహము మరింత మితిమీరుచుండెను. వివశయై యామె తల్లడిల్లిపోవుచుండెను. ఏకాంతము. అర్ధరాత్రి. మెల్లగ నామె గది తలుపులు మూసివేసి, తిరిగి మంత్రికుమారుని సమీపించినది. ఆలోచన సభిన యించినది. సాహసించ తప్పినదికాదు. చిగురువంటి తనచేయి నొకసారి మంత్రికుమారుని కపోలముపై వేసి నిమిరినది. దానికి నతఁడు తెలివి తెచ్చుకొనలేదు. పాపమా యువతి, మెల్లగ మంచముపైఁ గూర్చుండి, మంత్రికుమారుని స్నిగ్ధకపోలములను గట్టిగ ముద్దుపెట్టుకొనినది. ఇంకే మున్నది? తటాలున నాతఁడు లేచి కూర్చుండెను. యువరాణిని పోల్చుకొనలేదు. 'విజయా!' యని సంబోధించెను. జవాబు రాలేదు. తన లేఁ బుగ్గల నొకసారి తడుముకొని తిరిగి చూచెను. యువరాణి ముసుగు తీసి వేసెను. మంత్రికుమారుని కళ్ళు జిగేలుమనెను. హృదయము జల్లుమనెను. అతఁడు నివ్వెఱపోయి, భయకంపితుఁడై, దవ్వుగా మంచముపైనే గూర్చుండి యుండెను. ఒక్క-క్షణ మెవ్వరును మాట్లాడలేదు.

మంత్రికుమారుఁడు తలవంచుకొనియే కూర్చుండెను. వసుంధర మాత్ర మాతని చెప్పవాల్చక చూచుచుండెను. కొంతసేపటి కామెయే మంత్రి నందనునితో నిట్లు సంభాషింపఁజొచ్చెను.

యువరాణి :— ఏమి ? భయపడుచుంటివా ?

(మంత్రికుమారుఁడు జవాబీయలేదు.)

యువరాణి :— అయినచో నంతదూరముగఁ గూర్చుంటివేల ?

(మంత్రికుమారుఁ డొకసారి మొగమెత్తి యువరాణిని జూచి తిరిగి తలవంచుకొనెను.)

యువరాణి :— నిన్ను నే నేమైన యడుగవచ్చునా ?

(అడుగవచ్చు నన్నట్లుగా నాతఁడు శిరఃకంపము గావించెను.)

యువరాణి :— నీ వింత ప్రయాసకోర్చి యీ దేశము వచ్చుటకుఁ గారణము చెప్పెదవా ?

బుద్ధిమతి :— దేశాటనము చేయవలయుననియే !

యువరాణి :— ఇప్పు డే దేశ మేగెదవు ?

బుద్ధిమతి :— చెప్పఁజాలను.

యువరాణి :— ఇచ్చటనే కొన్నాళ్లు ఉండరాదా ?

బుద్ధిమతి :— ఉన్నచో ప్రయోజనము ?

యువరాణి :— యువరాజ వగుదువు.

బుద్ధిమతి :— అసంభవము — అది యెట్లు జరుగును ?

యువరాణి :— సంభవము కాకూడదా ?

బుద్ధిమతి :— నాకా వాంఛ లేదు.

యువరాణి :— కలిగించుకొమ్ము — నిన్ను నే రాజుచేయుదును.

బుద్ధిమతి :— నేను బ్రహ్మణుఁడను, రాజు నెట్లగుదును ?

యువరాణి :— బ్రహ్మణులు రాజ్య మేలుట శాస్త్రసమ్మతమే గదా ! నీవు ఊఁ అన్నచో, నే నీ రాజ్యమునకునిన్ను రాజు చేయఁగలను.

బుద్ధిమతి :— మరి మీ రెచ్చటి కేగెదరు ?

యువరాణి :— నేను మీ భాగస్వామినై యుందును.

బుద్ధిమతి :—అనగా నేమి ? నా కర్థము గాలేదు.

యువరాణి :— (నవ్వి) ఈమాత్రము తెలియదా ? ధర్మార్థ కామమోక్షములయందు మీతో సగపాలు పంచుకొనియెదను.

బుద్ధిమతి :— 'పిల్లి అంటే మార్జాల మన్నట్లున్నది.' నాకే మియు బోధపడ లేదు.

యువరాణి :— (పెద్దపెట్టుగ నవ్వును.)

బుద్ధిమతి :— (భయసంశయాందోళనుఁడగును.)

యువ :— చాల చమత్కారివలె నున్నావే! ఈమాత్ర మర్థము చేసికొనలేవా ?

బుద్ధి :— భావగర్భితముగ మాట్లాడిన నాకుఁ దెలియదు. రేపు బయలుదేరి దేశాంతరము పోనున్న నాకీ రాజ్యాధిపత్యము లేమియు నక్కఱలేదు.

యువ :— అక్కఱలేదన్న తప్పిపోవునా ? నీ వీ దేశపు రాజు కాఁగలవు ! అప్పుడు మనమిద్దఱము.....

బుద్ధి :— ఆఁ! ఏమనుచున్నారు ?

యువ :— అప్పుడు మన మిద్దఱము జంటగా సుఖింపవచ్చును.

బుద్ధి :— చాలు. బోధపడినది. ఆ విషయమున నేను సాహ సించలేను.

యువ :— ఏమంత తప్పవని అని ?

బుద్ధి :— ఏమైనను సరే ? ఆ మాట మీరు రడుగవద్దు.

యువ :— అది అడుగక తప్పదు. ఇది భగవత్సంకల్పమైయుండ వచ్చును. ఇంతకు మునుపు నాకెవ్వరిని వివాహమాడు సంకల్పమే లేదు. కాని తొలుదొల్త మీ మోము చూచిన దగ్గఱనుండి నాకెనలేని ప్రేమావేశము మీయందుఁ గలిగినది. అప్పుడే మిమ్ములను వరించితిని. మిమ్ములను దప్పించి యితరుల నింక వరింపను. మిమ్ము చూడకుండ క్షణమైన నుండఁజాలను. ఈ నా కోర్కె కాదని త్రోసివేయక నన్ను పరిగ్రహించి సుఖముండుము.

బుద్ధిమతి కొంకపర్యాయము మతిపోయినట్లయ్యెను. అతని కన్నులు తిరుగఁజొచ్చెను. విజయకుమారి వద్ద చేసిన బాస హృదయమును కలంచుచుండెను. ఎన్ని ఆపదలైనను లెక్కచేయక, శ్రమించి గట్టెక్కితినని సంతోషించిన వ్యక్తి, కీయాపద గడవనిదయ్యెను. ఇది మరింత ప్రమాదకరముగదా ! నూతన పథికునకు రెండు దారులు గలిసినట్లయ్యెను. ఏ దారినిబట్టి పోవును ? విజయకుమారి రూపరేఖావిలాసము లిప్పటికి నాతనికి కనుమఱవు రాలేదు. తన ఆశయము నెఱవేరలేదు. ఇంతలోనే ఈ చిక్కు. ఇవతల వసుంధర యువరాణియై, స్వతంత్రముగా రాజ్య మేలుచున్నది. ఆమెమాట తిరస్కరించినచో, తత్క్షణమే కారాగృహవాసము తప్పదు. 'పంజరములోని చిలుక' తానిప్పుడు. ఇక తన కార్యము, మనోరథము సఫలీకృతముగఁ జేసికొనుట కష్టసాధ్యము. అయిన నా చిన్నవాని మనస్సు మారలేదు. అతఁడు ధైర్యముగనే యుండెను. విజయకుమారికి దక్క మరియొక యువతికి, తన ప్రేమలో భాగమతఁ డీయఁదలచలేదు. ఒక్కసారి అతఁడు నిట్టూర్పు పుచ్చి, తిరిగి యువరాణి కిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

బుద్ధి :— ఇంతకుమునుపు నేను మనుజపురాధీశుని యనుఁగుఁ గూఁతురు 'విజయకుమారిని' ప్రేమించితిని. ఆమెయు నన్ను ప్రేమించినది. మా యిరువురిమధ్య నిర్మాణమైన ప్రేమసౌధము అతి సుందరమును, మిక్కిలి దిటవైనది. దానిని గూలఁద్రోయ యత్నించుట మీకు న్యాయముగాదు.

యువ :— మరి నా మనోరథమును విఫలముఁజేయుట నీకు మాత్రము న్యాయమా ?

బుద్ధి :— కావచ్చు.

యువ :— అట్లయిన నీ యాశయము మొదటికే చెడును. నీ బ్రతుకును శూన్యమగును. నీవు నన్ను వరించువఱకుఁ గారాగృహములో బంధించివైచెదను. సూర్యరశ్మి సోకని చీకటి కొట్టులోఁ బడి యుండెదవో ? నన్ను వరించి, హాయిగ, నీ జీవితమును ప్రకాశవంతము జేసికొనియెదవో, ఆలోచించుకొమ్ము. రేపు నీ మనోభిప్రాయమును మార్చుకొననియెడల, నీ గతి యేవిధముగఁ బరిణామమందునో నీకే తెలియఁగలదు.

అటులపైని బుద్ధిమతి ప్రత్యుత్తర మీయలేదు. అతఁడు క్రింది చూపుతోనే నిలుచుని యుండెను. రాజకుమారి కనులు కొద్దిగ జేవురించినవి. ఆమె మరి యేమియు మాట్లాడక తత్క్షణముననే యంతఃపురప్రవేశము గావించినది. అప్పటికి తెల్లవారుటకు రెండు గంటలు వ్యవధిమాత్రమున్నది. కోటలో నగారా మ్రోగినది. మంత్రికుమారునకు నిద్దుర పట్టలేదు. అతఁడు లేచి, యిటునటు గదిలోఁ బచారుచేయుచుండెను. ఏమి చేయుటకు నతనికి బాలుపోలేదు. అతని చూపులో జడత్వ మావహించెను. హృదయాందోళనము మిక్కుటముఁ గాఁజొచ్చెను. 'అందనివండ్లకఱ్ఱుసాచి, యగచాట్లు పడవలసి వచ్చెగదా !' యని యతఁడు మాటి మాటికిఁ జింతించుచుఁ దన్ను దా నిందించుకొన జొచ్చెను. ఇంతలోఁ

గులాయములనుండి లేచి, ద్విజవ్రజము మేతలకై బోవుచుండ, కలకల ధ్వనులు సంకులమై వినవచ్చెను. మంత్రికుమారుఁడు దానున్న గది గవాక్షము తెఱచి చూచెను. తూర్పు వెలవెల బాఱెను. తూర్పుకాంత శిరోభూషణమువలె నుదయభానుఁడు ప్రకాశించుచు, జగంబునకు సాక్షాత్కార మిచ్చెను. నవప్రేమికుల హృదయంబులు జాఱెను. కంజాక్షుఁ బాఱెను. అబ్జకాండంబు విప్పారెను. మకరందాసక్తమైఁ జేరి పద్మముల యందు బందీకృతములై, నిశియెల్లఁ వగవందిన, మధుకరశ్రేణికి, విడుదల కలిగెను. మంత్రినందనునికి మాత్రము విడుదల లేకుండెను. అతఁడు పోయి ప్రాతఃకృత్యములనెల్ల యథాప్రకారము, నెఱవేర్చుకొని తిరిగి, తన బసఁజేరి, కూర్చుండియుండెను. ఫలహార, పానీయములు, రాణి యనుమతిపై, సేవకు లమర్చిరి. కొంతసేపటివఱకు బుద్ధిమతి వానిని ముట్టలేదు. అతఁ డేదియో ఆలోచనాపరుఁడై యుండెను. ఫలహారమునుఁ గొనివచ్చిన సేవకుఁడు తినవలసినదని మంత్రికుమారుని ప్రార్థించెను. విధిలేక నాతఁడు కొన్నిఁటిని దినెను. అతనికి నాకలిదప్పికలపై నాలోచనయే లేకుండెను. భావిప్రయత్నమునుగూర్చి చింతసేయుటదక్క యతని భావంబున నేఱొక చింత లేకుండెను. "ఈ విపత్సాగరము నెట్లీఁది యొడ్డున బడుదునా ?" యని యాతఁడు గాఢాలోచనానిమగ్నుఁడయ్యెను. మాతృదైవమును మనమునం దలంచుకొని, మ్రొక్కుడుచు, నయ్యమాత్యాత్మజుండు, నిట్టూర్పుపుచ్చి, పర్యంకమందొ త్రిగిల్లెను. ఇంతలో యువరాణి యాజ్ఞాబద్ధులై భటుద్వయ మట ప్రవేశించినవి. వారలఁ జూచినదే తడవు బుద్ధిమతి తటాలున గూర్చొని, "ఎవరు మీరు ? ఎందుకు" అని యప్రయత్నముగఁ బ్రశ్నించెను. "యువరాణి యాజ్ఞయైనది. మీరంతఃపురము చావడివద్దకు దయచేయవలయు" నని యొక భటుఁడు సమాధాన మిచ్చెను. మారుమాటాడక బుద్ధిమతి వారల ననుసరించెను. తరువాత యువరాణి వసుంధరాదేవికిని, బుద్ధిమతికిని కొంతసేపు సంభాష

ణము జరిగినది. వసుంధర తిరిగి తొలిదినమునుబోలె తన భావము వెల్ల డించినది. మంత్రికుమారుఁ డంగీకారము చూపలేదు. వసుంధర పట్టు విడువలేదు. బుద్ధిమతి బుద్ధి యంతకన్నను మాఱలేదు. యువరాణి యాగ్రహము నిగ్రహాతీతమైనది. పర్యవసానము — ? మంత్రినందనునికి చెఱసాల !

# 5 సమ్మేళనము :

ఆహా ! కష్టము లెప్పుడు మంచివారికే గదా ? బుద్ధిమతి కుంతల దేశమును జేరి మాసత్రయము గతించినది. "పది దినములకొక పర్యా యము నాక్షేమవార్త నీకుఁ దప్పక తెలియపఱచెద" నని విజయకుమారి వద్దచేసిన, బాసలు, పన్నిన ప్రతిజ్ఞలు, సర్వము క్రియాశూన్యమై పోయినవి, "నీమనఃప్రియుఁడు–బుద్ధిమతి" యని వ్రాలున్న యొక్క లేఖఁ గూడ, విజయకుమారి చదువలేదు. ఆమె యెంతయు నాందోళన మందుచుండెను. 'బుద్ధిమతి — బుద్ధిమతి' హా ప్రియా ! యని యను క్షణ మామెకుఁ పలువరించుటదక్క యన్యచింతలేదు. అన్యకార్యము లేదు. అన్యాలోచనలేదు. అహర్నిశములామె తన మనమును మంత్రి నందనుపై లగ్నముచేసి, యా యువకుని మనోహరరూపరేఖాలావణ్యా బ్ధిలోఁదేలి సోలుట కలవాటుపడెను. ఎన్నియో తియ్యని కలలామె గాంచుచుండెను. నెలదినములలోపున గార్యము నెఱవేర్చుకొని, కబు రంపుదునన్న మాటకూడ, బుద్ధిమతి నిలబెట్టుకొనలేకపోయెను. పాపం. ఏమిచేయఁగలఁడు ? దైవము తన యెడల ప్రతికూలమై యుండినచో నెవ్వఁడు మాత్రమేమిచేయనోపు ?

బుద్ధిమతి కేదియో యాపద వాటిల్లెనని విజయకుమారి గ్రహిం చినది. లేనిచో నిన్నాళ్ళాతఁడు జాగొనర్పఁడనియు, తప్పక తనకార్యము నిర్వర్తించుకొని తన్నాదరింప వచ్చియుండుననియు, నామె దృఢముగా

నమ్మినది. కాని యేమిచేయుటకు నామెకు పాలుపోలేదు. తీవ్రముగ నామె యాలోచింపఁ దొడగినది. బుద్ధిమతిని గలిసికొనవలయునని, యామె హృదయమున కోర్కె వొడమినది. కుంతలదేశప్రయాణమునకై కాళ్ళు త్వరపడినవి. హృదయమించుక బెంగపడినది. ఎట్లైన నా రాచ పడఁతి కుంతలదేశముచేరి, ప్రియుని గలసికొనుటకై సిద్ధపడినది. ఇంతలోఁ దనప్రయాణమున కనుకూలముగనే తన్ను తొందఱపమమన్నట్లు, తనపై పగఁబూనిన శాత్రవభూపుఁడు విక్రమసింహుని వద్దనుండి, కరుణాకరున కొకలేఖ వచ్చిపడినది. లేఖచదువుసరికి, అతనిగుండెలో బండరాయిపడినది. తలభ్రమణము మొదలిడినది. చేతిలోనున్న లేఖ యట్లనే క్రింద పడినది. అతని మనసు సుడిపడినది. అతని దేహ మతనికిఁ దెలియకుండఁగనేపోయి, యంతఃపురముఁజేరి, ప్రక్కపైఁ జేరపడినది, "హా! చిట్టితల్లీ! విజయా"; యన్నమాటలాతడి నోటినుండి వెలువడినవి. తిన్నగానవి విజయకుమారి చెవిని బడినవి. ఆమె కాళ్ళు తడఁబడినవి. అడుగు ముందు పడినది. తండ్రి మొదట గూర్చున్న వసారా కంటబడినది. ఆమె లోనికి అడు గిడినది. గబగబ తొట్రుపాటుతో నాలుగడుగులు పెట్టినది. కాలికి పత్ర మొకటి యడ్డుతగిలినది. ఆమె క్రిందకుఁజూచి, యాపత్రమునుదీసి, విప్పి నది, అది యుత్తరము. రెండవప్రక్క, తటాలునక్రిందుగా "విక్రమ సింహ" యని చేవ్రాలు విజయ కంటఁబడినది, ఆమె కొంతసేపు చేతులచే కండ్లుకప్పుకొని, యట్లేనిలఁబడినది. కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొన్నది, ఉత్తరమువిప్పి శాంతముగాఁ జదివినది, విక్రముఁడు వ్రాసిన దామెకర్థమైనది. రాఁగల యుపాయమామె గ్రహించినది. వెంటనే యుపాయ మూహించినది, ఊహించి పరిపరివిధముల యోజించి నది. యోజించి యొక నిశ్చయమునకు వచ్చినది. తండ్రికిఁ దవ మూల ముగ రానున్న విపత్తునకుఁ జింతించినది. ఆ విపత్తును, తప్పకఁ దప్పింప వలయునని, ప్రతినబూనినది. పూని, యది నెఱవేర్చు మార్గమాలోచిం

చినది. ఆలోచించి, కొంత శాంతిఁ బొందినది. తండ్రినిజేరి మంచిమాటలతోఁ గొంత ధైర్యముచెప్పినది. మెల్లగ పగలు గతించినది. రాత్రి ప్రవేశించినది. రహస్యముగ విజయకుమారి, యిరువురు సేవకులను తన వద్దకు రప్పించినది. వారికేదియోచెప్పి, యొప్పించినది. కొంతధనము గ్రహించినది. సేవకులను ముందుగఁ బంపివేసినది. రహస్యముగ నా రాత్రి కోటదాటి వెలువడవడినది. జోరుజోరుగా నడక సాగించినది. పట్టణము తన దారికి వెనుకపడినది, ఆమె ధైర్యపడినది. ముందుపోయియున్న సేవకుల నిరువురిని గలసినది, అశ్వారోహణము గావించినది— ముందుకు సాగిపోయినది. లెక్కలేనిత్రోవ గతించిపోయినది. అల్లన తెల్లవాఱిపోయినది. గుఱ్ఱము తనంతటఁ దానొక జలాశయము చేరువనిలఁబడిపోయినది. రాజకుమారియు దిగిపోయినది. ఆమె సంగతింక నేమగునోయని చదావరులకూహ పోయినది—

అది కుంతలదేశము, రాజకుమారి విజయ, యాదేశపు రాజధానిఁ జేరుకొని నాఁటికి దినత్రయ మతిక్రమించినది. ఆమెతన యిరువురు రక్షభటులతోరహస్యముగా, నొక బస యద్దెకుఁ గొని యందు నివసించు చుండెను, నిజరూపముతో నామెయా పట్టణమునందు సంచరించి, మంత్రినందనుడి వృత్తాంతము నారయఁదలఁచినది. కాని, యందులకు సాహసింపనేరదయ్యె. అవును, అది యెన్నటికి నసంభవము. ఆమది యట్లు సాహసింపఁగలదా! బుద్ధిమతి జాడ యామె కలభ్యము. అతఁడు కారాగారమందే దినములు గడుపుచుండెను. అతడి మనసుమాత్రము విజయకుమారి పై నుండి మఱలలేదు. ఆతని కహర్నిశములు ప్రేయసి యగు విజయకుమారి నామస్మరణమే తరుణోపాయమయ్యెను. చెలిని దలంచుకొనుచు నిద్రపోయినపుడెల్ల నాతఁడు తియ్యని కలలు గాంచు చుండెను. విజయకుమారి యొకనాఁ డంగడివీధిలోనికిఁ బోయి, దుకాణములన్నియుఁ బరికించుచుండెను, పోవుచుఁ బోవుచు నామె యొక

దుకాణము చెంత నాగుట తటస్థించెను. ఎందు కామె యట్లాగినదో, ఎవరికిని గాక, నామెకే తెలియకుండెను. ఆమె నేత్రద్వయము మాత్ర మొక్కపరి పరిభ్రమించినది. మనసు సంభ్రమించినది. గాత్రము కంపించినది. హేతువు పెద్దవిశేషమయినదిగాదు, అందును సంశయాస్పదము. తేలీతేలని యంశము. అయినను, విజయకుమారిపట్ల పై పరిస్థితి కొంత సంభావ్యము కాకపోదు. మునుపు బుద్ధిమతి రత్నము లమ్మఁబోయి, పట్టువడిన దుకాణపు గోడపై నొక బల్ల కట్టఁబడియుండెను. దానిపై నిట్లు వ్రాయఁబడియున్నది. 'రాణీగారి నగలు, వగైరా దొంగిలించిన, చోరుని బట్టునిమిత్తమె, యువరాణి యాజ్ఞలేక, సేనాధిపతి, యిక్కడ "మంచి వెలకు రత్నములు వగైరా కొనఁబడు" నని యొక బల్లకట్టి, అమాయకముగా నొక యువకుఁ డమ్మవచ్చిన, వానినిఁబట్టి, రాణిగారి కప్పగించిన, తదుపరి యాతఁడు నిర్దోషియని తేలుటచే, యన్యాయముగా సద్వర్తను, యోగ్యుని, బట్టితెచ్చిన సేనాధిపతిని మూఁడు మాసములు పదవినుండి తప్పించినారు. ఇటువంటి పగటివేషములువేసి, చేసిన యన్యాయకృత్యములకుఁ బాలుగాకుండ, ప్రజలు జాగ్రత్తవహించవలసినదని, యిందుమూలముగా, హెచ్చరించడమైనది.'

పై లిఖితమును విజయకుమారి వదేవదె చదివి, హృదయాందోళనము పెల్లుమీఱ, వెనుకకు మరలినది. ఆమె హృదయములో ననేకమగు విపరీతభావము లుద్భవించి, యామెను గలంపఁ జొచ్చినవి. బుద్ధిమతియే యిట్లు మోసపోయి, పట్టుపడియుండునని, యామె తలంచినది. పట్టుబడుఁగాక, ఆతఁడు నిర్దోషియని తేలినదని వ్రాయఁబడియున్నదే ఆతఁడు తప్పక విడిచిపెట్టఁబడి యుండునెడల, యిన్నాళ్ళు దనుక యెక్కడి కేఁగియుండును? ఇంకను నాతఁడీ పట్టణములో జేరియుండియుండునా? అట్లున్నయెడల నాతని గలిసికొని, యింక నే ప్రయత్నము నక్కఱచేయకయే, యాసుందరాంగుని, పరిణయమాడి యిందందు సుఖించెదనని,

యామె ధృఢముగా నిశ్చయించుకొని, తన బసకుఁ జేర నరుదెంచు చుండెను. తన దేశమున కేఁగవలయుననిగాని, లేక, రహస్యముగా నా మంత్రినందనుని, పెండ్లాడవలెననిగాని, యామె మనసులో నిష్పాదు దల పోయుచుయ్యేను, భగవంతుని కరుణావలన, నాతని గలిసికొన వలయునని మాత్ర మూహించుచుండెను. అహా! ఆడువాండ్రెంతకైన సాహసులే కదా? విజయకుమారి తన బసఁ జేరుకొని, తదేక చింతతో బుద్ధిమతి ప్రస్తుత మెక్కడనున్న వాఁడా, యని తలపోయుచుండెను. పాపము! ఆమెకు నిజమగు వృత్తాంతమింకను దెలియదుగదా? ఆ చిన్నవాఁడు, ఆ దేశపు యువరాణి ప్రేమను నిరాకరించి, ఆమె క్రోధమునకు గురియై, చెఱసాలలో గ్రుగ్గువృత్తాంత మా చిన్నిదాని కేమి తెలియును. తెలిసిన నింకెంత వనటఁగుందునో కదా?——

విజయకుమారి రాత్రికి రాత్రి లేచి యెక్కడికో పలాయనమైన దన్న వార్త యొక్కక్షణములో మనుజపురమెల్లఁ గలయఁబ్రాకినది. మూర్ఖుఁడగు నా విక్రముని బెండ్లాడ, నిష్టములేక, పాపము పారిపోయిన దని ప్రజలెల్లరు విచారింపఁ జొచ్చిరి. లేకలేక, యెన్నియో నోములు, వ్రతములు, దానధర్మములు చేసి, చివరకు యోగీంద్రుని వరప్రసాదమున గాంచిన యీ యొక్కబిడ్డను చూచి యానందించు భాగ్యమున కీ మహా రాజు నోచుకొనలేకపోయెనే? యని పురజనులు దుఃఖాక్రాంతులై, దుష్టుఁడగు విక్రముఁడే యిందులకు గారణమని యాతని మాటిమాటికి నిందించుచుండిరి. ఎంత చింతించిననేమి లాభము? విధివ్రాత నేరుతప్పించ గలరా? అని కొందఱు విజ్ఞులు దుఃఖమగ్నులగు పురజనుల నూఱడించిరి. కరుణాకరమహారాజు, అచేతనునివోలె యుండి, యనుక్షణము విజయకుమారిని దలఁచుచుఁ గన్నీరు కార్చుచుండెను. అన్నపానముల యందాతఁడు మనసుఁ బోనీయక శ్లే నిరంతర చింతావార్ధిలో మునింగియుండెను. ఈ వృత్తాంతమంతయు, నానోట యానోటఁ బ్రాకి,

విక్రమసింహుని చెవిని బడెను. అతఁడు నిప్పుఁద్రొక్కిన కోతిచందంబున, తోఁకద్రొక్కిన నాగు విధమున, మహాగ్రహోదగ్రుఁడై, యిదంతయును, విజయకుమారిని నాకిచ్చి పెండ్లిచేయుటకిష్టములేక, కరుణాకరుఁడు పన్నిన పన్నాగమేగాని, వేఱొండు కాదని తలఁచి, వెంటనే, కరుణాకరుని బంధించి, రాజ్యము నాక్రమింపఁ దలఁచి, మనుజపురముపై దాఁడివెడలెను. అయ్యో! గోరుచుట్టుపై రోకటిపోటు చందమయ్యెనే? అసలే నిరంతర చింతాక్రాంతులై యున్న ప్రజలు, ప్రభువు, సైనికులును, తదుష్టభిమానుని, విపులసైన్యోపేతుని, బలవంతుని, నెట్లెదుర్చి పోరాడఁగలరు? చింత యనునది, యావద్బలమును, నడంగద్రొక్కు ననుటలో, యసత్యమేమున్నది. "చితాదహతి నిర్జీవం, చింతాదహతి జీవనమ్" అను నార్యోక్తి సూనృతముగదా? ఇక, నెవ్వరెట్లు సాహసించి, యా సమయమున బోరొనర్తురు. అయినను దేశాభిమానము కొంత ప్రోత్సహింపక మానదు. బలవంతులగు, యోధులుకొందరు సైన్యములను హెచ్చరించి, విక్రమునిపైఁ దిరుగఁబడి, యుద్ధమొనర్చిరి. పెక్కురు రిపుయోధులను బరిమార్చిరి. తుదకు వీరియందును, లావుమంది మగణాంతమును గనిరి. ప్రభుభక్తికై, దేశగౌరవమునకై, జీవము లర్పించిరి. ఎంత యొనర్చినను, లాభ మిసుమంతయుఁ గల్గినదికాదు. దైవము ప్రాతికూల్యమై యుండునెడల, నేమి యొనర్చిన నేమి ప్రయోజనము. చివరకు మనుజపురము విక్రమసింహుని యధీనమైనది. రాజోత్తముఁడగు, మనుజపురాధీశుని, కరుణాకరుని యాతఁడు బంధించి, చెఱసాలయందుఁ బెట్టించి, రాజ్యమును చక్కఁబెట్టుచుండెను. సావకాశముమీఁద విజయకుమారి జాడ లెఱిఁగి, యామెను బల్మిమీఁదనైన రప్పించి, పెండ్లాడెదనని, విక్రముఁడు పట్టుదల వహించెను. దుర్మార్గులు పట్టినపట్టు విడుచుట, వారి జీవితాంతమునగాని, యాలోఁగ గాదుగదా? 'పుట్టినబుద్ధి పుల్లలతోనే

పోవలె. రానురాను కథాగమన మెంతటి గడ్డుసమస్యలను లేవఁదీసుకొని పోవుచున్నది. ఎంతటి చింతాకరమగు ఘట్టములను మెట్టుచున్నది. ఆహా! విధినిర్ణయం.

విజయకుమారి వెనువెంట వచ్చిన సేవకు లిరువురు ఒకనాఁడు రాజవీధిని బోవుచుఁ దిన్నగాఁ గనఁబడు కోటగుమ్మమువద్ద కేఁగి నిలుచుండిరి. ఆ సమయమున నెదురుగా, నొకసేవకుఁడు అప్పుడే తన పనిని ముగించుకొని, యింటి కేఁగ, కోట వెలువడి వచ్చుచుండెను. విజయకుమారి సేవకులిర్వురు, నావచ్చు రాజసేవకునిగాంచి, బుద్ధిమతియొక్క వృత్తాంత మేమైన వీనికిఁ దెలిసియుండకపోదని యెంచి, వానివలన, నాసంగతి తెలియఁగోరి, రాజవీధిని ననుసరించి పోవు నవ్వానిని దరిసి, కుశలప్రశ్న గావించిరి. రాజసేవకుల కెట్టి మర్మములు దెలియునో? వీరును నా తీరువారే గనుక గ్రహించి, తత్సేవకుని మంచి మాటల మెప్పించి, మెల్లగా లోగుట్టును బైకి లాగిరి. 'దొంగను పట్టుటకు దొంగయే కావలెనుగదా?' 'వజ్రం వజ్రేన భిన్నయేత్.'

బుద్ధిమతియొక్క యావద్వృత్తాంత మిప్పుడు విజయకుమారి యనుచరులకు తేటతెల్లమయినది. వారు తడయక తత్క్షణముననే, బసకుఁ బోయి విజయకుమారి యెదుట దీనవదనులై నిలువఁబడిరి. సేవకుల యొక్క మోమువాలకము, నా విషాదరేఖలఁ గనుంగొనుసరికి, విజయకు చెప్పరాని భయము కల్గెను. ఏమి విపత్తు సంభవించెనో, లేక సంభవించునో యని యామె సంభ్రమముతో, నొకెంతసేపు మాటలాడ కట్లే గూరుచుండి, తదుపరి యేమి జరిగినదో తెలిసికొనవలయుఁగాని, యిట్లూరక భయపడిన ఫలమేమను నిశ్చయముతో, నా రాకుమారి భటునితో నిట్లు సంప్రతించెను.

విజయ :— ఇంతవరకు మీ రెక్కడఁ దిరుగుచుంటిరి.

ఒక-సేవ :— (కొంచెము గొంతు సవరించుకొని) రాజవీధులఁ గల మనోహర హర్మ్యతతులు, వానియందుండు అపూర్వదృశ్యములఁ గాంచుచుంటిమి.

విజయ :— మన పట్టణమున నిట్టి దృశ్యముల, చూడలేదా ?

ఒక-సేవ :— చిత్తము. ఎన్నియో చూచితిమి.

విజయ :— అట్లయిన నిందుఁగల ప్రత్యేకత యేమి ? మీ జాగునకిది హేతువుగాఁ గన్పట్టుటలేదు.

ఒక-సేవ :— యువరాణీగారు మన్నింతురుగాక ! రాజవీధిఁగల యాయాదృశ్యములను దిలకించుచుఁ గోటదరి కేఁగి, కొంతసేపు నిలు చుంటిమి.

విజయ :— కారణము ?

ఒక-సేవ :— ప్రయోజనముఁ గోరియే.

విజయ :— ఏమది ?

ఒక-సేవ :— 'అమాత్యనందనుల' వృత్తాంతమైన దెలియ వచ్చునేమో ? యని.

విజయ :— అట్లయిన చాల మంచిది. ప్రయత్నమేమైనది ?

ఒక-సేవ :— ప్రయత్నము కొనసాగినది. అచ్చటి యొక రాజ భటుని మెప్పించి, యావద్వృత్తాంతము, తెలిసికొంటిమి.

విజయ :— అట్లయిన 'బుద్ధిమతి' యెక్కడ ?

ఒక-సేవ :— కోటలోనే ?

విజయ :— ఉద్యోగమా ?

ఒక-సేవ :— కాదు, దుర్యోగమున కోటదాఁటి, వెలికి రానో పని పరిస్థితి సంభవించినది.

విజయు :— అనఁగా సారాంశము.

ఒక-సేవ :— (మాఱుపలుకలేదు).

విజయు :— ఏమంత విషాదకరమూ ? ఎట్టి వార్తనైన, నే వినుటకు సిద్ధముగనే యున్నాను, తడయక చెప్పుఁడు.

ఒక-సేవ :— చెప్పుటకు నోరాడకున్నది. ఇట్టి ప్రమాదకర మగు స్థితి, మన, మంత్రినందనునికి, సంభవించునని, కలనైన దలంచలేదు.

విజయు :— ఏమైనఁ దెలిసికోఁదగినవార్త, వివరింపక తప్పదు.

ఒక-సేవ :— చిత్తము. ఈ దేశపు యువరాణిగారి, యాగ్రహమునకుఁ గురియై, వారు కారాగృహవాసులై యున్నట్లు తెలిసినది.

విజయు :— ఏమి? ఎంతపని జరిగినది! ఇందులకు 'బుద్ధిమతి' చేసిన దోసమేదియో ? మీకు తెలియునా ?

ఒక-సేవ :— అది మీ హృదయమునకు విచారము కలిగించు నది. మావంటివారు తెగించి చెప్పకూడనిది. క్షమించవలెను.

విజయు :— క్షమించుచునే యున్నాను. మఱేవిధమున, నా సంగతి నాకుఁ దెలియును. తెలిసినచో, నెట్లయిన, నా స్వామిని ఆ యాపదనుండి రక్షించి, దక్కించుకొందును.

ఒక-సేవ :— అట్లయిన, యువరాణిగారు కొంచెము చిత్తగించ వలెను. తమరు మాఱువేషముతో, నీ దేశపు యువరాణీగారిని గలిసి కొని, సంప్రదించుట మంచిది. అంతయుఁ దమకే తెలియఁగలదు. రహ స్యముగఁ బోయి మాట్లాడి కార్యమును సాధించు నేర్పు, తమ కలవడియే యున్నది. మావంటివారు, నుడువఁబనిలేదు.

విజయు :— మీ మాటలు చాల బాగున్నవి. అయిన నేఁడే, పోయి జరిగిన సంగతేదియో పరికించెదను. యువరాణికి నా ప్రభువుపై యాగ్రహమెందులకుఁ గలిగినదో, ఇంతక్రూరదండన, కేమంతదోసమో ?

తెలిసికొని, ఎట్లయిన నా స్వామిని విడిపించితీరెదను. నీవు పోయి వాజి నాయత్త పఱుపుము.

ఒక-సేవ :— చిత్తము. ఆజ్ఞాపించునట్లు చేసెదను.

సేవకు లిరువురును వెలుపలి కేగి, గుఱ్ఱమును సిద్ధముచేసియుంచిరి. తాము విన్న పూర్తి వృత్తాంతమును చెప్పలేనందులకు వారిలో, వారు తటపటాయించుచుండిరి. విజయకుమారి మాత్రము సేవకుని మాటల లోనే సర్వమును గ్రహించినది, ఆమె మిగులనేర్పరి, యని మొట్టమొదటనే, చెప్పితినిగదా ? 'ఆవలించుచోఁ బేగులుసైతము లెక్కపెట్టఁగల' నేర్పరి యామె. సహజసౌందర్యవంతుఁడు బుద్ధమతి. అతని జూచి, పురుషులే, మోహమునకు గురియగుదురు, యువరాణి వసుంధర అవివాహిత, ఆమె యాతని బ్రేమించి యుండుననియు, తనకుచేసిన బాస నిలఁబెట్టుకొనఁదలచిన మంత్రినందనుఁడు, బుద్ధిమతి, యామె ప్రేమను నిరాకరించియుండుననియు, అందుచే, నిట్టి కష్టమునకుఁ బాలయ్యెననియు, విజయ గ్రహించిన దయ్యెను. ఆమె హృదయము, ప్రియునకు సంభవించిన, విపత్తునకు మిక్కిలి బాధపడెను. తలంచిన, తలఁపులోనే, ద్రవించిపోవుచుండెను. ఈ హేతువే నిజమగునెడల, నామె కేమి చేయుటకు, తోచకుండెను. ఇంతవరకు తానొకర్తెయే బుద్ధిమతిని, బ్రేమించి యాతనికై యున్ని యఁగచాట్లకుఁ బాలగుచున్నది. ఇప్పుడు వసుంధరకూడనా ? ఆహా ! విధీ యని, పాప, మా విజయకుమారి, లోలోన నించుక విచారించుచు, ధైర్యమించుకఁ దెచ్చుకొని, యేమైనను, యువరాణి వసుంధరను గలసి కొని మాట్లాడినగాని, చేయవలసినదేదియో నిశ్చయింపఁజాల నని, తెగించి బయలుదేరినది.

అది యువరాణి వసుంధర యంతఃపురము, గాయక శిఖామణి యొార్తు చక్కని కంఠమెత్తి మధురాతి మధురముగఁ బాడుచున్నది. వసుంధర యా గానమున లీనమై బ్రహ్మానంద మనుభవింపుచుఁ దల

యూపుచున్నది. మధ్యమధ్యను, సెబాస్ బళీ! యని కరతాళ ధ్వని చేయుచున్నది. అంతిపురము కవాటము దరి నొక సేవకుఁడు నిలుచుని, యొక ఆడుమనిషిని (యువరాణి చెలికత్తె) నొకర్తుకను బైటికి రమ్మని కనుసంజ్ఞ సేయుచుండెను. అది గుర్తించి, ఆ యువతి, వెలుపలికి విచ్చేసి, భటుఁడు విన్నవించినదేదియో సంగ్రహించి, మరల యంతిపురములోనికిఁ బోయినది. తదుపరి, నొక యరగంటకు గానము ముగిసినది. యువరాణి యా పాటకత్తెను, సబహుమానముగా, సగౌరవముగా సాఁగనంపినది. ఇంతలో నామె చల్లని పానీయము నొక కొంత పుచ్చుకొని, విశ్రమింపఁ దలఁచి కాబోలు, చెలికత్తెలను వెలుపలికిఁ బొమ్మని, యాజ్ఞాపించినది. అందఱును, యువరాణి యానతి నిర్వర్తించిరి. ఒకదాసి మాత్రము పోఁ బోయి నిలుచుండి, రాకుమారి మొగమువంకఁ జూచుచున్నది. ఆమె ముఖలక్షణమును బరిశోధించినచో, నామె యేదియో యుదంతము చెప్పనుంకించుచున్నదని తెలియవచ్చును. యువరాణి, యది గ్రహించి, చెలికత్తెనిట్లు ప్రశ్నించెను.

యువరాణి :— అట్లు నిలుచుంటివేమి? ఎందుకుపోవు?

చెలి :— ఇప్పుడే వెళ్ళిపోయెదను. తమతో నొక వార్త విని పింపవలసియున్నది.

యువ :— ఏమది? త్వరగాఁ జెప్పుము.

చెలి :— తమ దర్శనమునకై యొక యువకుఁడు, గాన కళలో, జ్యోతిషములో నారితేరినవాఁడు విచ్చేసియున్నాఁడు. ఇందాక, భటుఁడు ఈ సంగతి నాతోఁ జెప్పిపోయెను. ఏమని సెలవు?

యువ :— అట్లయిన వెంటనే, వారిని కచేరి చావడిలోనికిఁ బ్రవేశపెట్టించుము. నేను నట కిప్పుడే వచ్చెదను.

చెలి :— చిత్తము. ఇప్పుడే యేఁగెదను. (నిష్క్రమించును).

చెలికత్తెపోయి భటునితో, యువరాణి సమ్మతి తెలిపినది. యువరాణి నిర్దేశించిన ప్రదేశమునకా వచ్చిన యువకుని భటుఁడు చేర్చినాఁడు. యువకుఁడన యువకుఁడా? అంత ఠీవి, అంత రాజసము, అంత సౌందర్యము, ఏ యువకునియందున్నది? పొడుగుపాటి శరీరము, తీర్చిదిద్దిన యువయువముల సొగసు, చేరలఁ గొలువదగు కనుదోయి, విశాలమగు, ఎత్తగు వక్షఃస్థలము, గుండ్రని ముఖము, కనులలో రాజసము తొలుకాడుచున్నది. తలపైన చెమ్లా మిక్కిలి యందము నించుచున్నది. తా నెక్కిన గుఱ్ఱము, నా భటున కప్పగించి; యాతఁడు కచ్చేరిచావడిలోఁ బ్రవేశించి యొక పీఠమున, గూర్చొనియుండెను. నాటకమున పాత్రధారివలె సర్వాంగసుందరముగఁ దయారై, యా యువకుఁడు చూపఱుల కనులకు విందు ఘటించుచున్నాఁడు. ఆహా! యెవరాతఁడు? ఎందుకొఱకుఁ బ్రవేశించినాఁడు.

యువరాణి వసుంధరాదేవి, యంతలోఁ బ్రవేశించినది. ఆమెను జూచు తడవు, అభ్యాగతుఁడైన యా యువకుఁడు లేచి, ప్రత్యుత్థాన మొనరించెను. యువరాణి, యా యువకుని నమస్కారమును సవినయముగ నందుకొని, కూర్చుండ నియమించి, తాను నుపవిష్టయైనది. అనంతర మా యువతి, వచ్చిన యువకునితో నిట్లు సంప్రతింపఁజొచ్చెను.

వసుం :— నీ పేరేమి? నివాసస్థల మేది?

యువక :— నా పేరు విజయుఁడు, మాది మనుజపురము.

వసుం :— మనుజపురమా! అచ్చటి విశేషము లేమి?

యువక :— విశేషము లేమియు నాకుఁ దెలియవు. నే నా పురము విడచిపెట్టి నేఁటికి మూఁడు వత్సరములు దాఁటినది.

వసుం :— పోనిమ్ము. నీవు వచ్చిన కార్య మేదియో చెప్పుము.

యువక :— నేను గానకళలో నెక్కువ ప్రసిద్ధిచెందియున్నాను. రాజసభలలో నా యొక్క గానకళానైపుణ్యమును జూపి, సత్కారము

లందుచు జీవించుచుందును. ఈ విద్యను వెనుకవేసికొని, దేశములు తిరుగుటయే నా పనియైయున్నది. అట్టి యవకాశ మిచ్చుటగూడ లభింపఁగలదని, యాశచే వచ్చితిని.

వసుం :— చాల సంతోషమయిన సంగతి. ఇంతటి చిన్నవయసులో నింతటి విద్యానైపుణ్య మెట్లు సంపాదించితివి ?

యువకు :— అదియంతయుఁ గేవలము గురుకృప.

వసుం :— సరే ! మచ్చున కేదియే నొకపాట పాడి వినిపింపుము. పదఁపడి కచేరి యేర్పాటు చేయింతును.

యువకు :— చిత్తము. చిన్న మనవి యొకటున్నది.

వసుం :— ఏమది ?

యువకు :— వీణె యిప్పించఁగోరుచున్నాను.

వసుం :— గాయకులు, సాధనములులేకుండ వచ్చుట గలదా ?

యువకు :— నా వద్ద వీణె యుండెడిది. అది నా ప్రాణసమము. దాని నీ మధ్య నెవరో దొంగిలించిరి. ఈ పరిస్థితిలో నట్టివంటి వీణె నెట్లు తిరిగి సంపాదించుకోఁగలను ?

వసుం :— అయ్యయ్యో ! పాప ! మంతపని జరిగినదా ? సరస్వతీ స్వరూపమగు వీణె నపహరించుట సరస్వతినే దొంగిలించుటకాదా ? ఎంతటి దుష్కృత్యము ?

యువకు :— అయినవారికిఁ దెలిసిన యుచితానుచితము లందఱికిని దెలియునా ? రోజులు బాగులేనిచో నేదియైనఁ గోల్పోవుట సంభవించును.

వసుం :— సరే ! కానిమ్ము. వీణె నిప్పుడే తెప్పించెదను.

యువరాణి, చెలికత్తెనుబిలిచి, యామెచే తన యొక్క వీణెను తెప్పించి, యువకునిచేతి కిప్పించినది. వెంటనే, యాతఁడా వీణెనందు

కొని, శ్రుతి మేళవించి, రాగాలాపనముచేసెను. ఆహా! యేమి కంఠ మాధుర్యము, "బాలపల్లవగ్రాస కషాయకంఠ కలకంఠ కంఠధ్వనిని గూడ మించి, చెలంగుచున్నదే! మాటలలోనున్న మాధుర్యము, పాటలో ద్విగుణీకృతముగఁ గన్పట్టుచున్నది. గంధర్వాంగనలకైన నిట్టి కంఠస్వర మాధురిమ, మలవడియుండుననుట సంశయాస్పదమనినచో, మానవమాత్రుఁడైన నొక యువకుని కెట్లబ్బెను? ఈ యువకుని మాటలలోను, కనుబొమలద్వారా ప్రసరించు, హావభావములలోను, స్త్రీ తత్త్వమే, యుబుకుచున్నది కాని, పురుషలక్షణము లగుపడుటలేదే? ఇందేదియో యింద్రజాల మిమిడియున్నది. అని యువరాణి వసుంధర, ఆ యువకుఁడు, పాడ మొదలిడినంతనే, సంశయమునకు లోనైనది.

యువకుఁ డట్లనే మధురాతి మధురముగ, వీనులవిందుగఁ బాడుచుండెను. తానును గాయికియేయైనను, నంతటి నేర్పు గలిగియుండమి వసుంధర, మాటిమాటికి, నా గానమున లీనమై, మహోత్సాహమున బరవశయైయుండుటయేగాక, ఆయువకునివలన, నా విద్యనింకను బెంపొందింప వలయునని కోరికవహించెను. ఆహా! అట్లేయగునెడల నింక, నా కుహనాయువకుని, మనోరథ మీడేరుఁగదా?

పాట పూర్తియైనది. యువకుఁడు వీణెను ప్రక్కనబెట్టి, రాజకుమారి కరతాళధ్వనికి, యుప్పొంగి, సవినయముగ, నా కుమారికి, నా విద్యయందుఁగల, యభిరుచిని గొనియాడెను. యువరాణియు, నా యువకుని గానవిద్యానైపుణ్యమున, కచ్చెరువంది, మిక్కిలిగ నాతని బ్రశంసించెను. ఇంతలోనేమి కొన్ని యల్పాహార, పానీయములఁ దెప్పించి, యువకుని విందొనరించెను. ఆతఁడును సంతోషమున వానిగైకొని భుజించి, సెలవిప్పింపుఁడని మరల దర్శనము చేసికొందుననెను.

అప్రయత్నముగ, నెందులకో, యువరాణి పెదవి చివరభాగము నుండి, యొక చిరునవ్వు బయలువెడలెను. వాత్సల్యభావ మామె ముఖమున

గలిసికొనియొదననియు, అంతవఱకు, నే నిచ్చిన విత్తముతో, మీారు మఱి యొకబసయందుండి కాలమును, నెట్టవలయుననియు, అప్పుడప్పుడు, తాను వచ్చి, వారిని గలిసికొని క్షేమ మారయుదు ననియు" విజయకుమారి భటులను హెచ్చరించినది. సేవకు లిరువురు సంగీకారమును సూచించిరి.

మరునాడు, సూర్యోదయముననే, విజయకుమారి స్వీయ దిన కృత్యములెల్ల నిర్వర్తించుకొని, కోటకు బయలుదేరి వెళ్ళినది. భటులు నామెతోనే, సత్రపుయజమానికిఁ జెల్లింపవలసిన సుంకమును జెల్లించి, విజయకుమారి, నిర్దేశించిన వేఱొక బసలోఁజేరి, కాలక్షేపము చేయు చుండిరి.

విజయకుమారి కోటకేఁగుసరికి, యువరాణివసుంధర, యీామెకై చేయవలసిన, యేర్పాటులన్నియుఁ జేయించినది. యువకుని రూపములో నున్న, విజయకుమారి, మంత్రియొసఁగు, స్వాగతమును స్వీకరించి, సంతో షించుచు, లోనికిఁ బ్రవేశించినది. నాఁటినుండి యువరాణి మన్ననకుఁ బాత్రుఁడై, యీా యువకుఁడు (విజయ కు), ఆమెకుఁ దెలియని సంగీత శాస్త్ర రహస్యములన్నియుఁ జెప్పి, బోధించుచుండెను. యువరాణి, వసుంధరయు, నుత్సాహముతో, యువకుడు చెప్పిన ప్రకార మభ్యా సముఁ గావించుచుండెను. ఆమె కాయువకునిపై, రానురాను మితిలేని భక్తి గౌరవములు, కలిగెను. ఆహా! ఇంత చిన్నవయస్సునందే, విజయ కుమారి; కిట్టి సంగీతశాస్త్రరహస్యములన్నియు నేర్పి, ప్రావీణ్యమును, గల్గించిన, యీా గురువెంత ప్రవీణుఁడు, ఎంత ధన్యుఁడోకదా?

అప్పుడప్పుడు విజయకుమారి (యువకుఁడు) తన సేవకులకు, వస్తారురూపముతోనే పోయి, కలిసికొని, వారి క్షేమమూరయుచుండెను. తమ రాజ్యము, తన తండ్రి సంగతియు, నేమైనదోయని, యీామె ప్రతి రోజు తలంచుచు, విచారించుచునేయుండెను. తప్పక యేదైనముప్పా వాటిల్లియుండుననని, దుర్మార్గుఁడైన విక్రముని సంగతియు, నాత్రఁడు

వ్రాసినయుత్తరము, నామె గ్రహించియుండుటచే, తలపోసెను. అనతి కాలములో, నేఁగతినైన, తాను బుద్ధిమతితోఁ గూడి, మనుజపురము పోవఁదలంచెను. తలంచినంత వేగముగఁ గార్యసాధనమగునా? క్రమముగ, నెలదినములు గతించిపోయినవి బుద్ధిమతి విషయమై యామె యనుక్షణ మాలోచించుచున్నదేగాని, ఏమిచేయుటకుఁ బాలుపోలేదు. ఎట్లయిన యువరాణిని మభ్యపెట్టి, యామె, బుద్ధిమతిని గలిసికొని, మాట్లాడ వలయునని, నిశ్చయించినది.

యువరాణి వసుంధర యొకనాఁడు, యువకుని వద్దఁ గూర్చుండి, కొంతసేపు గానకళావినోదమును గావించిన తరువాత, చిరునవ్వుతో యువకుఁడు వసుంధరతో నిట్లు సంప్రతించెను.

యువకు :— దైవకృపవలన, చాలమట్టుకీ విద్యయందుఁ బ్రవీణులైరని, సంతోషించుచున్నాను. మీబుద్ధికుశలత, నేర్పరితనము, పట్టుదల ప్రశంసాపాత్రములు.

వసుం :— దైవకృపయేమి? అంతయు మీ కృపయే. ఇంకను నేర్వఁదగిన యంశమున్నది గదా?

యువకు :— అవును — ఇంక కొద్ది రోజులలోఁ బూర్తి గావింతును.

వసుం :— చాల సంతోషము. మీ మేలు మరువఁదగినదికాదు.

యువకు :— నేనొక విషయము, మిమ్ము నడుగఁ దలఁచి యున్నాను, అభ్యంతర మున్నదా?

వసుం :— అభ్యంతర మెందుకు? తప్పక యడుగుడు.

యువకు :— అడిగినవాని కన్నిఁటికి, సరిగనుత్తరము లీయ వలెను. అట్లయినచో, నడుగుదును.

వసుం :— సరియే. కానిఁడు!

విజయకుమారి యింకను యువకుని వేషములోనే యున్నది. బుద్ధిమతియొక్క ప్రేమలో, సగ౦ బాలు వసుంధరకు౦ బంచిపెట్టక తీరదని యామె నిశ్చయించినది. అట్లయినచో, విక్రమునివలన నే యాపదయు౦ బొందకుండ, సురక్షితముగ నుండగలమని, యామె గ్రహించినది. బుద్ధిమతి నెట్లయిన, యిందుల కొడంబఱుపవలయునని తలపోసినది ఆహా! యోగీంద్రుడు మొట్టమొదటనే జెప్పెగదా!

యువకుని వేషములోనున్న విజయను 'బుద్ధిమతి' తిలకించెను. అత౦డు పోలికపట్టలేదు. మాటలనే యత౦డు గుర్తింపలేని స్థితిలోనుండెను. బుద్ధిమతిని గా౦చుసరికి విజయకుమారి యొడలు కంపించెను. కండ్లవెంట యానంద బాష్పములు రాలెను. ఆతని రూపమును జూచుసరికి దుఃఖము౦ గూడ నామెకు వచ్చెను. ఏమియును నామె, బైటికి౦ దోపనీయక యంతయును లోన నడచుకొని, బుద్ధిమతిని, "దయచేయండి!" యని ప్రేమపూర్వకముగా స్వాగతమిచ్చి కూర్చుండ౦బెట్టి యిట్లు సంప్రతించెను.

యువకు :— మీతో౦ గొంచెము మాట్లాడవలసియున్నది.

బుద్ధి :— తమ రెవరు ?

ప్రియునిమాట యిన్నాళ్ళకు౦ జెవినిసోకుసరికి, విజయ కనులానంద బాష్పములతో నిండిపోయినవి. ఆమె చేతిరుమాలున, కనుల నొత్తికొనినది. ఇదంతయు బుద్ధిమతి కేమియు నర్థము కాలేదు. హావభావ మనోవేశమునుచూడ యేదియొ యుదంతము గలదని, బుద్ధిమతికి బొడగట్టకపోలేదు. అయినను యువకుని వృత్తాంతమును గ్రహించ కుతూహలము గలవాడు గావున తమరెవరు ? యెందుండి యిందుల కరుదెంచినారు కతంబెయ్యది ? బంధనవిముక్తిచేయ విచ్చేసిన యే మహనీయుడవో యని త్వరపడుచుంటి, శలవియ్యవలెననిన, యువకుడు దుఃఖమాపుకోలేక గ్రుక్కిలిమింగుచు, గద్గదస్వరముతో యువకుని వేషములోయున్న విజయకుమారి హా ! ప్రియా పడరానియిడుములుపడుచు తుట్టతుదకు

యీ కారాగారశిక్ష ననుభవించుచుంటివా? యని యాతని పాదముల మీద వ్రాలెను. అది గని బుద్ధిమతి చింతాక్రాంతమతియై యింప పురుషవేషములోనున్న విజయకుమారిని గ్రహించి హా! విజయా నీవా! యెన్ని నాండ్లకు నిన్ను చూడగలిగితిని. మన ఆశలన్నియు భగ్నాశలాయెను గదా! పడరాని యిడుములుపడుచు తుదకీగతికి పాల్పడితిని. విధివ్రాత తీర్ప నెవరి తరము. నీ వెట్లు ఈ యంతఃపురమును దాటి రాగలిగితివి. నీ వృత్తాంతముచెప్ప మన విజయకుమారి కన్నుల కొనలనుండి భాష్పములు జార, బుద్ధిమతీ యేమందును? జరిగినదంతయుజెప్ప నొక గాథ. ముందు నిన్ను యీ బారినుండి యెట్లో తప్పింపు నుపాయ మాలోచించవలయును కుశల మనంతరము విశదపరచెదగాక యని నాటి రోజున కష్టసుఖములు నొండొరులు సంభాషించి యేవియో భావికార్యముల గూర్చి నాలోచించి తిరిగి నిజవాసమునకు విజయకుమారి వరుదెంచినది. మరునాడుదయముననే పురుషవేషములోనున్న విజయకుమారి, వసుంధరాంతఃపురమునకుపోయె. వసుంధర జూచినదే తడవుగ పట్టరాని సంతోషముతో దగ్గరకుపోయి తోడితెచ్చి యుచితాసీనునిచేసి మహాశయా తాము పోయిన రాయభారమేమైనది? బుద్ధిమతి యీయకొనెనా లేక నిరాకరించెనా? సత్వరముగ చెప్పుమన, తొందరపాటుతోయున్న వసుంధరను విజయుడుజూచి అమ్మా అనుమతింపక యెందుపోగలడు. అయినను పట్టుదలగల వ్యక్తిగావున యెట్టకేలకు నెట్లో నొప్పించితిని; కాని బుద్ధిమతి కొన్ని నిబంధనలకు లోనై యుండుటవలన స్వల్పదినసంబులు వ్యవధిపెట్టెను.

వసుం:— ఏమా నిబంధనలు?

విజ:— ఒప్పుకొనెదనసిన వక్కాణింతును.

వసుం:— గురువర్యా అట్లంటిరేమి? యెట్టిదైన నా కోర్కె

లీడేర్చవలెననిగదా తమ్మార్రాధించుట. మీరొ నరింపనాజ్ఞ నిచ్చిన నెట్టి దుష్కార్యమునైనా చేయుటకు సంసిద్ధినై యున్నాను.

విజ :— వసుంధరా! బుద్ధిమతి మనస్సు నొరులకంకితమైన విషయము నీకు విదితమే అయినను నాతని హృదయఫలకములో నీ చిత్రము కూడా చిత్రించుట కొప్పుకొనెను. అదియును కొన్నినాళ్లు పట్టును. విజయకుమారిని కలుసుకొనిన యనంతరంబు యిరువురును, గాంధర్వ విధిని పరిణయమాడ నిశ్చయించెను.

వసుం :— మహాభాగ్యము తక్షణమే బంధవిముక్తినిగాజేసెద. మహానుభావ! సర్వమును మేలుచేకూర్చువాడవు నీవేగదా! విజయ కుమారికి యీ వృత్తాంతమంతయు నల్లన నచ్చజెప్పి యెట్లో భవత్ వాక్చాతుర్యముచే నామెను యానంద రసాబ్ధిలో ముంచి యీపని కెట్లో యీయకొనునట్లుచేయు భాగ్యము మీపై గలదు. యని వేనోళ్ల బొగడ సాగెను. ఆ మాటలు విన్నదే తడవుగా, బుద్ధిమతి నెట్లయిన కలియు కుతూహలముగలదు గావున, విజయకుమారి తొందరపాటుతో శలవు గైకొన నిశ్చయించెను. వసుంధ రంతట పరమానందభరితయై ఆహా! ఏమినా భాగ్యము గురువరా మీ మహోపకారమున కెంతయు కృతజ్ఞ రాలను నా కోర్కెను దీర్ప అవతరించిన పరబ్రహ్మవోలె నరుదెంచిరి. వేతనములకై వలసినంత ధనమును, సాయసంపత్తికి గావలసిన పరివారము గొనిపొండని చెప్పి మంత్రికాజ్ఞాపించెను. పురుషవేషములోనున్న విజయ కుమారి సాయసంపత్తి నవసరములేదని దినత్రయములో విజయకుమారిని తోడ్కొని వచ్చెదనని చెప్పి, శలవుగైకొని, తన సేవకులయొద్దకు జనెను. పోయినదే తడవుగా సేవకులు విజయకుమారిని దర్శించి అమ్మా బుద్ధిమతి దర్శనభాగ్యమైనదా? యెట్లుండెను? ఆతనిని దీసుకొనివచ్చు నొండుపాయ మేదైన పొడగట్టినదా? సత్వరముగా జెప్పుడని సేవకులు వేడుటయు, విజయకుమారి వారి యభిమానములకు సంతసించి, జరిగిన యుదంత

మంతయు వినిపించెను. అందుల కందరును సంతసించి నాటి కాల మెట్లో వెళ్ళబుచ్చిరి. వసుంధరయు సేవకులను రావించి బుద్ధిమతికిని యేకాంత సౌధము విడిదిగా ఏర్పాటుచేసి రాజోపచారములు చేయుటకు నాజ్ఞా పించెను.

అమ్మరునా డరుణోదయ మైనది. అంతకు మునుపే విజయ కుమారి రాకకు భేరీ నినాదములతో, మంగళవాయిద్యములతో వేచి యున్న పరివారమును విజయకుమారిజూచి సంతసించి పురప్రవేశ మయ్యెను. భేరీమంగళ వాయిద్యములు విన్న వసుంధర, దివ్యాలంకార భూషణధారిణియై దాసదాసీజనంబులు చందనతాంబూలాది వస్తువులు ధరించి వెంటరాగ, వసుంధర సింహద్వారదాపున కెదురేగెను. అంతట బంగరుపల్లకిలోనుంచి నరుదెంచుచున్న విజయకుమారిని వసుంధర యథో చిత సత్కార్యముల తోడ్తెచ్చి, తన సువర్ణమయశయ్యపై నాసీను రాలుగాజేసెను. అంతట విజయకుమారి వినమ్రవదనయై యిట్లు పలికెను. వసుంధరాదేవి గురువరేణ్యులగు విజయులు కాశీలో విద్వత్సభకు ఆహ్వానపత్రిక మీరు వచ్చుసరికే వచ్చినది. అచ్చటికిపోక తప్పినదికాదు. అన్యగా భావింపవలదని నుడువమనిరి. అని వక్కాణించెను. ఆ పల్కులు, ముఖముతీరు జూడ విజయుని పోలికయున్నది. అయినను వసుంధర కార్యాలోచనయై యున్నందున సంకోచములన్నియు పారద్రోలిమంచిది. అక్కా! నాకు మిన్నవగునీవు మన్ననచేయవచ్చునా? వృత్తాంత మంతయు నీకు విదితమేగదా! ఆలస్యమెందులకు మనోవాక్కాయ కర్మలందు మనకిష్టుడగు, బుద్ధిమతి సౌధమున కరుగుదమని, యిరువురును పోయిరి. అందు అన్యాక్రాంతాలోచనుడయ్యున్న బుద్ధిమతి యిరువురు రాకుమారికలనుచూచి, సిగ్గున తలవంచి యేమియుమాట్లాడక మిన్న కుండెను. అంత విజయకుమారి ఆనందభాష్పములుజార ప్రియునిముఖము వీక్షించి, “ప్రియా యేల యీ వృథాప్రయాస చెందెదరు. నేనొక తెనె

తములో భాగస్వామినై తినని తలపోసితిని, గాని నేను నా సోదరి వసుంధరను గూడ భాగస్వామినిగచేయు బాధ్యత మీది, ఇరువురము మీకు సమానులమేగదా! దైవము నుదుట వ్రాసియుండ వేరొకటి యెట్లగును?" యని ననేకతెరంగుల బుద్ధిమతిని నోదార్చెను. ఇంతలో నొక పరిచారిక యరుదెంచాందోళితమానసియై "అమ్మా విజయకుమారి! నీవరుదెంచినపిదప, విక్రముడు మీరాతనిని వివాహమాడ నిరాకరించినట్లు నిశ్చయించి, మీరాజ్యముపై సేనతో దాడి వెడలి రాజ్యమును యెట్టకేలకు వశముచేసుకొని కరుణాకర మహారాజుని బంధించెనట," యని తత్తరపాటుతో నుచ్చరించెను. ఆ పలుకులు విజయకుమారి విని గుండెజల్లుమన మేనువడంక "హా! దైవమా యెంతపనిచేసితివి? నమ్మినవారిని నాశనము జేతువా? లేకలేక నొక్క కుమారినై జననీజనకుల కతిగారాబుపట్టినై యున్న మాకీ విషాదహేతువేల? పుట్టిననాడె గిట్టిన వారి కీయాపద లేదుకదా? నావలన వారెన్నియో పడరానియిడుములపాలైరి. దుర్మార్గుడగు విక్రముడు యెంత కఠినాత్ముడో గదా! నొక్క స్త్రీవ్యామోహముకోసము దేశక్షోభ కలిగించిన మూఢుడెందైన గలడా" యని యనేక తెరంగుల చింతించి మూర్ఛిల్లెను. అదంతయు బుద్ధిమతి వినుచున్నాడు గావున కొంత మదికి చింతదోప రాజదంపతుల కవమానము జేసెనని విన్నవాడు గావున, తన తలిదండ్రులగతి యెట్లుండెనో యని తన దుష్ప్రవర్తనలకు తగిన ఫలము ననుభవించితినిగదా యని లోలోన కుములుచుండెను. ఆ వృత్తాంతమంతయు వసుంధర విని యిరువురను విచారమునుండి సేదతీర్చి వారలను దోడ్కొని, మనుజపురమునకు తన సేనతో విక్రమసింహునిమీదకు యుద్ధమునకు దాడివెడలెను. అది విని విక్రమసింహుడు యుద్ధసన్నద్ధుడై యుండెను. మనుజపురమున ప్రజలు తమ రాజు నోటమికి మిగుల దుఃఖించుచు విక్రముని వ్యతిరేకించుటకు తగిన సమయము కొఱకు నిరీ

క్షించుచుండిరి. ఇంతలో బుద్ధిమతి, విజయకుమారికల యుద్ధప్రకటిత ములను విన్నవారుగావున ప్రజలు సంతోషించి యేకోన్ముఖులైరి. మరు నాడు గొప్ప యుద్ధము జరిగెను. అందు యిరుతెగలవారు హోరా హోరీగపోరిరి. గాని విజయము బుద్ధిమతి, విజయకుమారికలకే. లభిం చెను. అంత విక్రముని దుర్మార్గమును లెక్కచేయక ధర్మమార్గమున నాతనిని సామంతరాజుగా, నాతని రాజ్యమునకుచేసెను. నాడు కష్టము లకు లోనై పడరాని యిడుమలుపడి నేడు మనుజపురంబునకు, విక్రమ రాజ్యమునకు, కుంతలదేశమునకు రాజ్యాధిపతి యయ్యెను. సుఖము లున్నచోటనే కష్టములు, కష్టములున్నచోటనే సుఖములు గదా! ఎంతటి వారికైన విధి నిర్ణీతమెట్లుండునో యెవ్వరెరుంగుదురు? మనుజపురాధీ శ్వరుడగు కరుణాకరుడు కూతుని క్షమాపణకంగీకరించి, తమ యభిలాష నెఱింగినవాడు గావున విజయకుమారిని, వసుంధరిని బుద్ధిమతికిచ్చి గాం ధర్వవిధిని వివాహము గావించెను. బుద్ధిమతి తన బుద్ధికుశలతచే నారాజ్య ములందు మంత్రిశేఖరుల నామమాత్రముగ నియమించి, రాజ్యభారమం తయు తానేవహించి ప్రజలను కన్నపిల్లలవలె బాలించుచు ప్రజల మన్ననల బొందుచు రామరాజ్యమును ధిక్కరించుచున్నట్లు పాలించుటచే నాతని కీర్తి నలుదిశలు వ్యాపించి నాచంద్రతారకముగ అవనిపై పేరునిలచెను.

— సమాప్తము —



—: నా రాబోవు రచనలు :—

భాగ్యరేఖ

హంతకుడు